లై కురువింద మణి సందీపితంబు లైన కెందలిరుఁ జందురకావి చందువల నొంది మకరంద బిందు బృందంబుల పొంపున నందంబుఁ జెందు గురివెంద పందిరులయందు నానందంపుఁ జిందులు గొను నిందిందిర సందోహంబుల సందడు లేచి క్రందుకొన డెందంబులు కొందలపడ నిందిరకు మందిరంబు లగు కెందమ్ముల కందువలకుఁ బందెమ్ములు సలుపుచు, నందఱు బిరుదులు జిందఁ గొందఱు ముందఱ నరిగి యిందిందిర ముఖరి తాళిందమ్ము లగు కందర్ప విజయ మాకందమ్ముల క్రిందఁ బిఱుందులు చలింప నందియలు మొరయఁ గుందసంపు సందిబొందులు చందోయి నొరయఁ జిందులు ద్రొక్కుచుఁ గందుక కేళిం దేలుచు; నిట్లు విహరించు చుండ, ఫల పరిపాక సౌభాగ్య సంపన్న శుక సంభాషణంబై భాగవతంబుకరణి, వసుమతీజా తాభిరామంబై రామాయణంబుపగిది, నారూఢ హరికుమార బాణాసనంబై భారతంబు వైఖరి, నామోదిత సుమనో విసరంబై యింద్రనగరంబు బాగున, స్నేహీభూతగంధవాహంబై ధనంజయ నివాసంబు పోలికఁ, జక్రాంగ పాళికా సరస్ఫురితంబై దండధరు నిలయంబుభాతి, భాసిత పలాశంబై నిరృతినిశాంతంబుచందంబున, ననుగత రస లసితంబై వరుణ మందిరంబురీతి, సముదిత గంధ బంధురంబై పవనుని భవనంబుకైవడి, విలసితకుందంబై రాజరాజ నికేతనంబు చాడ్పునఁ, గందళిత మహాపర్ణాభిశోభితంబై కైలాసంబుతీరున, జాతిరహితంబై యభేద బ్రహ్మంబు చెలువున, నఖిల ద్విజ సూక్తి గ్రాహ్యంబై మాధవుని యందంబున, శుక ముఖ వనప్రియచయంబులకు నిష్టఫలంబు లొసంగుచు సకలవిధ కుసుమాకరంబై, కుసుమాకరం బొప్పుచున్న సమయంబున.

—* సూర్యాస్తమయము *—

సీ. కరినాథుఁ బట్టునక్రంబుపై విడిచిన
    సరసిజాక్షుని చేతి చక్ర మనఁగ,
వరుణదిక్సుదతికి వాసవుఁ డనురక్తిఁ
    బంపిన కెంబువ్వుబంతి యనఁగ,

సపరశ్శైలాంత హర్మ్యాగ్ర జాలాంత రా
    శ్రిత మహాదర్పణ బింబ మనఁగ,
భువనాధిపతి నిజపురమందు బిరుదుగా
    వల నొప్ప నెత్తిన ధ్వజ మనంగ,
తే. నభ్రసుందరి సుగుణ రత్నాకరునకు
    మేలు గలుగంగ బలురతనాలు గూర్చి
పట్టె త్రిప్పెడి యారతిపళ్లె మనఁగఁ,
    గమలమిత్రుఁడు చరమభాగమున నొప్పె. 19

ఉ. ఎనయఁగన్ సత్పతి దీప్తినుండి వడి తా నేతెంచి యే మెంచునో
యనుశంకం గడుభీతిచే ద్రుతముగా నబ్ధిం బ్రవేశింపనో
యన నస్తాలయ వాటికిం జనియె నుష్ణాంశుండు, తత్పీడ యొ
య్యనఁ దప్పెం గద యంచు నక్కువలయం బానందముం జెందఁగన్.

ఉ. వారుణదిగ్వధూటి నిజవాటికిఁ బ్రేమ నినుండు రాఁగఁ దా
భూరి ముదంబునం బొదలి భూరి మణీ గణ భూషణాలిఁ గైం
పారెడు పట్టుచీర మెయి నంట ఘటించి కుచద్వయంబున
న్గారిమఁ గుంకుమం బలఁదెనో యనఁ దోఁచెను సాంధ్యరాగముల్. 21

క. ఇనుఁ డరిగె ననుచు సమయాం
గన నీలపటంబు దాల్చి కలయాశల మే
కొనియెను జారిణికై వడి
ననఁ జీఁకటి పుడమిఁ జెలఁగె నతిబహుళంబై. 22

చ. అపర వధూటికా మణికి నై యతిమోహముఁ జెంది రాజు చొ
క్కపుసిరి గల్గు మంత్ర ఘుటికాతతి విచ్చిన పూలుఁ గొన్ని యం
దపుఁ గపురంపుఁ బూసలు ముదంబున వశ్యతఁ గూర్పఁ, బంచెనా,
నపుడు సరోజ జాండమున నంతట బారులు దీరెఁ దారకల్. 23

చ. మరుఁడను భూమిపాలునకు మాపటివేళల దిక్పురంధ్రికల్
విరులును లాజలుం గలిపి వేడుకఁ జల్లిన సేసలో యనన్,

సరవి నభఃప్రదేశ మను సౌధమునం బొనరించు దివ్య సుం
దరతర వజ్ర బాలిక లనంగనుఁ జుక్కలు పిక్కటిల్లెడున్. 24

—* చంద్రోదయము *—

మ. కుముదంబుల్ వికసింపఁ, గోకములు సంకోచింపఁ, గామివ్రజం
బు మనంబుల్ చిగిరింప, నల్ దెసలమోముల్ దెల్వి రాణింప, న
క్కమలంబుల్ ముకుళింప, వెన్నెలలు జోక న్మింట సూచింప, సం
తమసంబుల్ నశియింపఁ, జిత్తినుల చిత్తంబుల్ విజృంభింపఁగన్. 25
చ. తొలిదెస కెంపు నొంద, నయుతుల్ భయమందఁ, బయోధి పొంగఁ, ద
మ్ములు మొగుడంగ, జక్కవలు మోహము నింపఁ, దొగ్రలహింప, మిన్
వెలయఁ, దమిస్రముల్ సొలయ, వెన్నెలపుల్గులు గేర, మారుఁ డ
గ్గలముగఁ బోరఁ, జందురుఁడు గాంతులు సల్లుచుఁ దోఁచె నంతయున్.
తే. మదనుఁ డిగురాకుఁదూపులు పదనువెట్టఁ
గళలు దేరెడు శాణచక్రం బనంగఁ,
దామసీ సతి, కర్ణావతంస మనఁగ,
నుదయగిరిఁ జంద్రమండలం బుదిత మయ్యె. 27

—* యామినీపూర్ణతిలక యుద్యానంబున విహరించుట *—

వ. ఆ సమయంబున యామినీపూర్ణతిలక యనుగత సఖాళీ తిలక యై ప్రొద్దువోక నిదురరాక లేచి కేల్ సాఁచి నల్దెసలం జూచి దండనుండు నొక వేదండయానపైఁ గై దండ యిడి మందగమనంబున బృందారక సుందరీ సందోహము నడుమఁ గడు నెడనై నందనవనంబునకుం దరలు పురందరారవిందవదన చందంబున నందం బై యుద్యాన వన సమీక్షణోద్యోగ యై చని చని; యచ్చట నచ్చపుఁ బచ్చరాల మెచ్చుగు తిన్నెల, వెన్నెలపొడలు గడలుకొనఁ జివురు జొంపంబుల సొం పొందిన మాకందంబుల చెంతఁ, గొంత సేపు విశ్రమించి; తదాశ్రిత వనితాజన కల్పిత ఫల కుసుమా ద్యుపహారంబుల హర్షంబు నొంది, యవ్వలఁ జని, జవ్వనులం బిలుచుచు, నవ్వని గలయం దిరుగుచు, మంజుతర కుంజంబు లరయుచు, నంబుయంత్రంబులఁ జూచుచుఁ, బాదులు గట్టి

బోదులు చేసిన మల్లికా వల్లికాదుల నవలోకించుచు, సొంపులు మెఱయు సంపెఁగలు గోయుచు, సొంపు సంపాదించు సాలంబుల లోలంబు లౌను శిఫా జాలంబుల నయ్యాటంబుల నెయ్యనెయ్యున నుయ్యాల లూఁగుచు, బాగుమీఱిన నికట తటినీ తట నిబిడిత సికతా తలంబులఁ గప్పురగంధులతోడ నెప్పుగఁ గప్పురంపుఁ దిప్పల మొగమ్ములు గప్పి వెన్నెల తప్పు లాడుచు, దప్పినఁ జప్పట లప్పళించుచు, నొకరొకరిం గికురించు చు, నాటలఁ బాటలఁ బూఁదోటల విహరించుచుండ. 28

(రగడ)

అలివేణిరో, మన కామోదంబులు
గలయఁగఁ జేయుచుఁ గలనాదంబులు
పెంపు దలిర్పఁగఁ బికవారంబులు
గుంపులుగొని పల్కుచుఁ గీరంబులు
జాలగు తేఁటుల ఝుంకారంబులు
నోలిగ శారీ హుంకారంబులు
పరగఁగ నొప్పెడు పాటీరంబులు
మెఱయుచు నుండెడు మేటీరంబులు
నడరు నెపుడుఁ గుసుమాసారంబులు.
కడువడిఁ జూడరె, కాసారంబులు
గలిగిన చోటికిఁ గదలుఁడి, తావులు
గలఁగినఁ జాలును గపురపుదీవులు.
చూడరె పొగడను సొంపైయున్నది;
పోఁడిమిఁ జెప్పను మునుపేఁ గన్నది.
కంటేఁ దక్కువ గా దేపాటికి,
నంటే పోదము యావనవాటికి?
పదవే పోదము పదుగుర మిప్పుడు;
పదరక పోఁదగు, బలుకాల్ చప్పుడు
వినిన బెగడి పోవే రాయంచలు?

పనివడి నేర్పేర్పడఁగాఁ బంచలు
చాటు చేసికొని చనరే యింతులు.
మాటలాడకురె; మఱి మీరంతులు
ఎక్కడ వచ్చిన నే మన మీరలు;
అక్కరో వింటివె యది మీవారలు
సేయఁగ నన్ననఁ జెలువే సీకును?
బోరమెద. నుండవె, పొలఁతిరో నాకును
బనియే మున్నది? పలుకే మంచిది.
మన లేదా? నీ మాటల సంచిది.
తేటగ మన మీ తేనియ వంకలు
దాటఁగఁ దరమే? తలఁపున శంకలు
మానరె. చూచిన మంచిది వెన్నెలఁ
గాని కాని మఱి కపురపుఁదిన్నెలఁ.
పదరే యీ పొదప్రక్కఁ, గూడుదము,
ముదముగ దాఁగిలిమూఁత లాడుదము
రారే; నే నీ రమణిని ముట్టితిఁ,
గోరికి దీఱఁగఁ గొమ్మను బట్టితి;
పంతము మీఱఁగ బంతు లాడుదము,
చెంతకు రమ్మా చెలిని గూడుదము.
పువ్వులఁ గోయుద మీవ్వనితావుల;
దవ్వా పోదము, తనరెడుతావుల
కిమ్మైన్న యున్నవి; యేలరె నవ్వులు?
ఈమహి రాలిన వేఱరె పువ్వులు,
గాడిగ వెన్నెల గాయఁగఁ, దరువుల
నీడలఁ బొడవెన్నెల లీయిరువుల.
ఏ తెంతము మఱి యిందుల కించటు.
ఆతత కేశుల నలరుచు నందటు

నాడుచుఁ బాడుచు నతివలు వనమున
వేడుక చేసిరి వెలఁదికి మనమున. 29

క. అం దలసి సొలసి రాజ పు
రంధర కన్యా లలామ రమణులు వేడ్కం
జెంది యుపచారములు సే
యం దగ శయనించె సుమ కృతాంచిత శయ్యన్. 30

తే. అట్లు శయనించి, కూరుకు నంది యంద
కంతలో లేచి, వివశాత్మ యై కలంగి,
తెలిసి కను మూసి, క్రమ్మరఁ దెలివిఁ గాంచి,
కాంచి దిక్కులఁ, జెలులను గాంచి, కాంచి. 31

తే. మగిడి శయనించి, మఱి లేచి, మై విదిర్చి,
మదినిఁ దలపోసి, తలపోసి, మరునిగాసి
కిని భరింపఁగ లేక, నూ ర్పెనయఁ జిక్కి,
పల్క నేరక యున్న, న ప్పడఁతు లెల్ల. 32

క. 'ఇది యేమి వింత; యిచ్చట
నిదురించెను, లేచి లేచి నెఱి మనలను జూ
డదు, మాటలాడ దెంతయు;
నిది యేమో తెలియనేర? మే మంద మయో!' 33

వ. అని యిట్లు తమలోఁ దాము వితర్కించి చుట్టుముట్టి రాపట్టి నిట్టట్టుఁ బట్టి యట్టె దాని మొగంబు గనుఁగొని యొక్కసఖి యిట్లనియె. 34

క. 'ఓయమ్మ యేమె యిది? నీ
వీవెడ మముఁ జూచి పల్క వేమే? మమ్మున్
డాయవు; కారణ మేమే?
పాయనిదయతోడఁ జూచి పల్కుము తల్లీ.' 35

చ. అన విని చాలఁ దెప్పిరిలి యాసఖిఁ గన్గొని పల్కె-'నో సఖీ,
విను మొకవింత, యే మని భువిన్ వచియించెద? నైనఁ జెప్పెదన్;

వనిఁ జరియించి యిచ్చటికి వచ్చి ముదంబునఁ బుష్పసెజ్జ నిం
పున శయనించి యుండుతఱిఁ బొందుగఁ గూర్కెడి సంతసోపలన్

చ. ఒకకలఁ గంటిఁ, గంటి ఘను నొక్కనిఁ జక్కెరవింటివాని పో
లికిఁ దనరారువాని, నమలీమస కాంతుల నొప్పువాని, సం
వికసిత సార సాక్షు; మఱి విన్నది గన్నది లేక యెవ్వఁడో
సకి యతఁ డింక నాసరస జాణతనమ్మున నుండె, నుండినన్.

ఉ. నేనును వానిపై రడుగ నేరక మార కఠోర కార్ముక
జ్యా నినదంబు సోఁకి తమి నంది చెవుడ్పడి చూచుచుండ, వాఁ
డూనిన ప్రేమ దివ్యఫల మొక్కటి యిచ్చి యదృశ్యుఁ డయ్యెఁ,
ద్రానన, చంద్రుఁ డజ్జలధరాంతర మొందినరీతి. నంతటన్,

ఉ. తత్తరపాటుఁ జెంది మది తల్లడిలంగను మేలుకొంటి; నా
చిత్తజ సన్నిభాంగుఁ డెటుఁ జెందెనొ నన్నిటుఁ గ్రూరుఁడైన యా
చిత్తజుబారినిం బడఁగఁ జేసి? యిఁకం దమిఁ దాళఁ జాల నే;
నిత్తఱిఁ బల్కరమ్మ దయ, నిందుల కేమి యొనర్తు భామినీ?'

వ. అనిన శుకవాణి యిట్లనియె.

ఉ. ఈకల మంచి దమ్మ; మది నిందున సంశయ మొందకమ్మ; యా
శ్రీకర గాత్రు దర్శనము చేకురునమ్మ; శుభావహంబునన్
శ్రీకర మమ్మ పండు; సుత సిద్ధియు నౌఁ గదవమ్మ; మేలు మే
లీ కల మాకు సమ్మదము హెచ్చెఁ గదమ్మ సుధాకరాననా.

వ. అని యిట్లు పలుకుచున్న సమయంబున.

సీ. మలయాగముల జాఱి వలయాగములఁ దూఱి
కలయాపగలఁ జేరి పొలుపు మీఱి,
ఘనసారములఁ బొంది ఘనసారములఁ జెంది
మనసారఁ జెలు వంది తనువుఁ బొంది,
మల్లికా నవ హేమ వల్లికా సుమనోమ
తల్లికా యుత సీమ నల్లికఁ గని,

కేళికా రస లోల బాలికా సుకపోల
పాలి కాసవలీల మేలుఁ గాంచి
తే. శారికా కీర పరభృత చంచరీక
కలిత కలకల నినద సంకలిత చలిత
విరహిజన మాన సాంభోజ వీథి యగుచుఁ
గలయ నేతెంచె శీతల గంధవహుఁడు. 43

వ. అట్టిసమయంబున. 44

శా. రాకా శీతమయూఖ చంద్రికలు మేరల్ మీఱి మై నిండ, ను
ద్రేకాంభోజశరాశుగావళులు లోఁ ద్రెప్పారఁ, బాటీర శై
లైకాంచ త్పవనంబు పైపయిఁ గడున్ హెచ్చై విజృంభింప, ము
క్కాఁకం జెంది వెలంది తాళక తమిం గాసిల్లి మూర్ఛిల్లినన్. 45

వ. అచ్చట నున్నయయ్యాళీసందోహంబు హాహాకారంబు లొంది. 46

ఉ. 'ఇవ్వని కేల వచ్చితిమి యిందఱముం గుమిగూడి? వచ్చి యీ
పువ్వులతోఁట నేల చొరఁ బూనితి మిప్పుడు? పూని యిచ్చటం
గ్రొవ్వున నేల నిల్చితిమి గొబ్బునఁ బోక?' యటంచు మించుఁబోం
డ్లవ్వనజాక్షిఁ జూచుచును హా యనుచున్ మది సంభ్రమించుచున్.

చ. 'కల గనువారలుం గలరు; కల్గిన, నీకలవంటి దెందునుం
గలుగునె? కల్గె, నివ్విధము గాసిలుచుండెడి కాంత లెందునుం
గలరె? వధూటులార, యిఁకఁ గార్యము మీఁద వచింపరమ్మ. యీ
చెలి నిట నుంపఁగాఁ దగదు చేరుద మింటికి వేగ బాగుగన్.' 48

వ. అని యిట్లుచితంబుగా శైత్యోపచారంబులు సలిపి సేదదేర్చి యా
రాజపుత్త్రినిం దోడ్కొని పోయినయాలోన. 49

—* బిల్హణుఁడు చంద్రుని వర్ణించుట *—

సీ. సాంధ్యకృత్యము లెల్లఁ జలిపి, యిష్టం బైన
యీశ్వరునకు నమస్కృతు లొనర్చి,
భుజియించి, తావులఁ బొలుపైన చందన
మలఁది, పువ్వులు దాల్చి, హారరాజి
భరియించి, వలువలు ధరియించి, తాంబూల

మును జేయుచును వచ్చి, మోద మంది,
శయ్యాతలంబున శయనించి, చంద్రునిఁ
బరికించి వీక్షించి భావ మలర
తే. నింపుమెయి బిల్హణుండు వర్ణింపఁ దొడఁగె;—
నిదియు విరహిణులకుఁ జూడ మదనతాప
మెదఁ బొడమఁ జేయువిత్తనం బెన్న మఱియు
మరునకు బలంబు వరచంద్ర మండలంబు. 50.
వ. అని మఱియు ని ట్లనియె. 51
ఉ. కలువల నిద్ర లేపి, రతికాంతుని మాంద్యము వాపి, పుష్కర
స్థలిఁ దిమిరంబుఁ జోపి, తమి తాఁకిన బాలల నూఁపి, దేవతా
వలి కమృతంబుఁ జేఁపి, యల వాసవదిక్పతి కుండలంబునై,
కలువలఱేనిమండలము కాంతిలుచున్నది తూర్పుకొండపై.
చ. ఇది గగనంబు గాదు, నుతియింపఁగ నౌ వనరాశి గాని; డాల్
వదలని తారకానిచయ పంక్తులు గావివి, ఫేనఖండముల్;
గుదురుగఁ జుట్టుకొన్నవర కుండలి గాకిది చందమామ గా;
దిదియును మచ్చ గా, దట శయించిన విష్ణుఁడు గాని చూడఁగన్. 53
చ. అరయ నభస్తలం బనెడి యందపు గందపు సానపై రుచిం
బరఁగిన చంద్రబింబ మను పాండుర చందన రాశి మీఁదటన్
నెరయఁగ వాసనార్థ మయి నేర్పు దలిర్ప శరద్వధూటి శ్రీ
కరముగ నిండుగా నిడిన కస్తురి నాఁగఁ గళంక మొప్పెడిన్. 54
చ. జలనిధిపంక మంచు మహి చాయయఁ జిహ్నము లేడిపిల్ల కం
దళిత సురేంద్రనీల మణి ధామ మటంచు వచింతు రంద ఱీ
కలువలఱేనియందుఁ గల కందును; నే ననుకొందు రాత్రులం
దలవడ మ్రింగినట్టితమ మంతర సంస్థ మటంచు నెంతయున్. 55
ఉ. చందురుఁ డన్మృగాధిపతి శౌర్య విజృంభణ వృత్తిఁ బూని పౌ
రందర దిగ్ధరేంద్ర కుహరంబుననుండి రుచుల్ సెలంగఁగా
మాదల కేఁగుదెంచుచుఁ దమఃకరికుంభము స్వాంశు రేఖికా
బృంద నఖంబులం జిదుమ వీడిన ముత్యము లౌను తారకల్. 56

సీ. ఈ కళానిధిచేతనే కదా దిక్కు ది
క్కుల వార లెల్లను దెలివిఁ గనుట;
ఈ వసుఖనిచేతనే కదా విబుధులు
కోర్కెల్ దీఱంగఁ గుడుపుఁ గనుట;
ఈ మహావిధుచేతనే కదా దివ్యు లె
న్నఁగ నిశాచరు లెల్లఁ దిగులు గనుట;
ఈసత్ప్రభునిచేతనే కదా మోదించి
కువలయం బెచ్చుగాఁ గూర్మి గనుట;
తే. అవుర! యీరాజుమహిమ యే మనఁగ వచ్చుఁ!
దమము వారించి యరుల సంతతి నడంచి
యన్యగతి డించి హరిపద మాశ్రయించి
యుదయగిరి దుర్గముననుండి యొప్పు నితఁడు. 57
ఉ. ఈయుదయాద్రి రాజత గిరీశ్వర, మీాసితభానుఁ డెన్న దా
క్షాయణి నేలుశంకరుఁడు, కప్పు గళచ్ఛవి, దాపుచుక్క లై
నాయకమూర్తి, యా ప్రమథ నాథులు దక్కినచుక్కలుక్, మహా
శ్రేయ ఘటం బొసంగఁదనుఁ జెంది భజించువియోగిపాళికిన్. 58
సీ. ద్విజరా జటంచు భావించుటయే కాని,
రూఢిగా దోషాకరుండు వీఁడు;
సన్మార్గగతుఁ డంచు జనులు పల్కెడు కాని,
గండు మీాఱిన నిశాటుండు వీఁడు;
నమృతకరుం డంచు నాఖ్యమాత్రమె కాని,
చర్చింపఁగా విషజనుఁడు వీఁడు;
కువలయప్రియుఁ డంచుఁ గోరి సెప్పెడు కాని,
పాడి దప్పిన చక్రవైరి వీఁడు;
తే. తమము వారించు రా జనుక్రమమె కాని,
యేపు మీాఱంగ నారుల నేఁచు వీఁడు;—
ననుచుఁ గులటలు దూషింతు రనుచు జనుల
త్రోవ రా వెఱచితొ నీవు తోయజారి? 59

క. సురలతెరువు ఫ్రా సాగితి
వరయుఁగ సత్పతి వశే! నిశాటుఁడ; వా నీ
కిర వొందఁగ విధునామము
హరి హర! తలపంగఁ జెల్లునా కమలారీ? 60

క. కమలంబున జననం బయి
కమలాగ్రజుఁ డనఁగఁ బరఁగి ఖరకరతతిచే
దమియింతు రే వియోగులఁ
గ్రమమున దయ మాలి; మలిన గర్భుఁ డ వెందున్. 61

చ. హరి కబళించుటల్, హరున కంబక మూటఁ, దమిస్రయందుఁ దే
జరిలుట, నీటఁబుట్టుటను, ఛాయలు గాంచుట, మేను వెంచుటల్,
ధరణిధరంబు లెక్కుటను, దగ్గుట, మిన్నులు ముట్టి వచ్చుటల్,
గరికరఁ బాంథకోటులను గాల్చుట, నగ్నివి సిద్ధమే శశీ. 62

సీ. ఓరి మాయసురేల పోసికొనెదవురా ?
తోరంపునీమేను దొంగివోను!
జెలఁగి రా వేల చేసెదవురా? ఖేచర
పాళి నీకండలు పంచుకతిన!
నీలీల మము గాసి యేల వెట్టెదవురా?
పర్వంబులను నిన్నుఁ బాము గఱవఁ!
గ్రోధించి మ మ్మింత వేధించె దేలరా?
కాలాగి విసరి ని న్నేలఁ గొట్ట!
తే. ననుచుఁ బాంథులు నిందింతు; రందువలన
లలిఁ బ్రవేశించెనో యీ కళంక మొకటి ?
గాకయుండిన శుచిమూర్తిఁ గాంచు నీకు
మలినతావృత్తి గలుగునే జలజవైరి ! 63

సీ. పొంచి యెంతయుఁ దోడఁబుట్టినదాన్నిల్లు
కంపవెట్టిన మహాఖలుఁడు వీఁడు !
చలపట్టి వెస నిశాచరవృత్తిని సదాళి

తేజంబు లడంచు నిందితుండు వీండు!
కలంగి ఘోషింపంగాం గన్నతండ్రినిం బట్టి
భంగపెట్టిన ఘోరపాపి వీండు!
మెఱసి యాపయి నున్న మిత్త్రుని విభవంబుం
జూడ జాలని నికృష్టుండు వీండు!
గీ. అంచు భువిలోన విరహిణు లాడుకొనంగ
సిగ్గు దోంపక మిన్నంది చెలువుమీఱం
దిరుగుచున్నావు, మీం దింత తెలియలేక;
తాళు వెన్నెలచేంకట్లు ధవళకిరణ. 64

సీ. వైర దప్పనివాండు మేదిని నీతండ్రి,
నిత్యజీవనవృత్తి నీదుతల్లి,
యిష్టసంపద లెల్ల నిచ్చు నీతోంబుట్టు,
నెమ్మి శ్రీ గలవాండు నీదుబావ,
పర సుమనో ధర్మపరుండు నీయల్లుండు,
నిర్మల చిత్త నీ ధర్మపత్ని,
చక్ర పాలన కళా శాలి నీమిత్త్రుండు,
విబుధుల పాలు నీ వితరణంబు,
గీ. తమము వారించు నీదు సందర్శనంబు,
నిఖిలజనులకు మోదంబు నీదుమూర్తి;
యిట్టిసంపద గలుగు నీ యట్టిరాజు
కోరి చూచిన గలండె యో కువలయేశ. 65

వ. అని యిట్లు బిల్హణుండు జంద్రునిం బేర్కొని బహుప్రకారంబుల వర్ణించుచున్న యెడ. 66

గీ. భోజనముసేసి కొప్పునం బూలు దుఱిమి
చందన మలంది తాంబూల మంది వేడ్కం
బోలుపుగా వచ్చి యామినీపూర్ణతిలక
యువనికాభ్యంతరమున శయ్యను వసించి. 67

—* రాజసుత బిల్హణుని చంద్రవర్ణనము విని వితర్కించుట *—

ఉ. ఆకరణిం గవీంద్రుఁడు శశాంకునిఁగూర్చి నేర్పు పెంపునన్
వాకొని తద్విశేషములు వర్ణన సేయఁగ నాలకించుచున్
దేఁకువ విస్మయాంబునిధిఁ దేలి మనం బలరంగ శంక చేఁ
గోకిలవాణి యిట్లరసెఁ గూరిమితోఁ దనలోన నేపునన్. 68

క. తమజనకుం డీసత్కవి
నమరఁగ జాత్యంధుఁ డనుచు నాడి వచించెం;
గ్రమ మొప్పఁ జంద్రవర్ణన
సుమహితముగఁ జేయఁ దొడఁగెఁ జూచినకరణిన్. 69

శా. 'అంధుం డెక్కడ! చంద్రుఁ డెక్కడఁ! దదీయం బైన యివ్వర్ణనా
బంధం బెక్కడ! నిట్టివింత గలదే భావింప నెచ్చోట నై
నం! ధాత్రీంద్రుఁడు మాకు నిర్వురకు నందం బొప్ప నన్యోన్య హృ
త్సంధానం బగు నంచు నిట్లొనరిచెం. జర్చింప వే యున్న దే?' 70

వ. అని మఱియును. 71

క. 'వ్రతభంగ మయినఁ గానీ
మతిమంతు నుదాత్తవేషు మానిత విద్యా
న్వితునిం గాంచెదఁ గన్నుల
కతుల మహోత్సవము గాఁగ.' నని చెలి ప్రీతిన్. 72

—*యామినీపూర్ణతిలక కవినిఁ జూచి మూర్ఛిల్లుట*—

సీ. వినుత విద్యా జిత ద్విజరాజు, ద్విజరాజు
రుచిరాజి నగుమోము రుచులవాని,
రమణీయవాణి భారతికాంతు, రతికాంతు
నతికాంతిఁ దెగడుసోయగమువాని,
నతులిత శుచి విభా హరిమిత్త్రు, హరిమిత్త్రు
వరమైత్త్రి గల్గు వైభవమువానిఁ,
గలిత తేజో లసత్కమలాప్తుఁ, గమలాప్తు
కమలాప్తి మెఱయు చందములవాని,

తే. సకియ మది నెంచి తమి నించి సంభ్రమించి
కరము లలరించి తెఱ వంచి కందళించి
పొంచి తిలకించి పులకించి పొలుపుఁ గాంచి
కాంచె రోహిణి జంద్రునిఁ గాంచినట్లు. 73

క. కాంచినయంతనె సతి పుల
కాంచిత దంతురిత దేహ యై నిశితోద్య
త్పంచ శర శర విపాటన
సంచలిత స్వాంత యై వెసన్ ధృతి దూలన్. 74

తే. పరవశత నొంది మూర్ఛానుభావ యగుచుఁ
బవన చాలన నిపతిత వల్లిమాడ్కిఁ
బంకజాయతలోచనఁ బడియె మఱియుఁ
బట్టు దప్పిన కనకపుఁ బ్రతిమ వోలె. 75

ఉ. ఆకడ నాకపీశ్వరుఁడు న త్తఱిఁ దామరసారిఁ గూర్చి యొ
త్తో కవు లెల్ల మెచ్చ వినుతుల్ పచరించుచు నుండి, యంతలోఁ
బ్రాకట బద్ధ కాండ పటిపై రమణీమణి మోముఁ జూచి య
స్తోక మహాదయాద్రిపయిఁ దోచిన చంద్రునిఁ బోల్చియిట్లనున్.

—* బిల్హణుండు రాజకుమారిని జూచివర్ణించుట *—

సీ. రాకేందుబింబమో రాజీవమో మించు
టద్దమో లేక నె మ్మొద్దు మొగమొ ?
చెలు వొందుకల్వలో చేపలో మరుని నా
రాచంబులో లేక లోచనములో ?
కోకంబులో విరిగుత్తులో బంగారు
కుండలో లేక వక్షోజయుగమొ ?
క్రొక్కారుమెఱుఁగో మేల్చుక్కయో నునుఁబైఁడి
తీఁగయో వే ఱొక్క తెఱవయొక్క ?
తే. అవుర యాకళ యాతావి యారమణత
యావిధంబులు నీ బెళ్కు లీకుశలత

యీసువృత్తత యీసొంపు లీమెఱుంగు
లీతళుకునిగ్గు లీచాయ లెందుఁ గలవు! 77

సీ. హరిణ విముక్త శీతాంశు బింబము గాని
పురుడింపఁగా నిది ముఖము గాదు ;
ఘన సుధా పూర్ణ కాంచన కుంభములు గాని
చర్చింప నివి యురోజములు గావు;
పంచశిలీముఖ శాణపంక్తులు గాని
గుఱిమీఱ నివియు ముంగురులు గావు;
నిరుపమ యువజన నిగళంబు లగుఁ గాని
యమరంగ నివి వీక్షణములు గావు;
తే. డాలు మించినమించుటద్దాలు గాని
గణుతిగొన నివి గండభాగములు గావు;
సోయగంబైనబంధూక సుమము గాని
భావమున నెన్నఁగా నిది మోవి గాదు. 78

మ. క్షితి నిర్లక్ష శశిరేఖ వింతఁ గలువ ల్చెందమ్మిరేకబ్జము
న్నతికల్ గుంభము లాకసం బిసుక దిన్యాల్ రంభలుం గాహళుల్
శతపత్త్రంబులు భావలీలఁ గొని యీచంద్రాస్య ఫాలాక్షు ని
ర్జిత దేహుఁడు శుకరాజవాహు మొలపించె న్నేనఁ జిత్రంబుగన్. 79

మ. ఉరు వక్షోజ యుగాంతరస్థ మయి నాయుల్లంబు రాదేమి? త
ద్భర సంఘృష్టి నశించెనో? విరహ సంతాపాగ్నిచేఁ గ్రాఁగెనో?
స్థిర లావణ్య సుధాంబుజాకరవరాప్తిఁ మున్గెనో? కామ త
స్కర వీరుండు హరించెనో నవ వయః కాంతార సంచారుఁడై. 80

సీ. ఈ భామ తనుకాంతి నేపారఁ జూచిన
హేమాభిధానంబు నెంచ నేల?
ఈ చాన యూరుప్రభా చాక చక్యంబు
రంభాభిమాన్యంబు రహిఁ నడంచు.
ఈ రామ నవ్య నాసా రమ్య లీల తి
లోత్తమాఖ్యను దల యెత్త నీదు.

ఈ కొమ్మ కన్నుల నిర వొందు బెళ్కులు
హరిణీవిలాసంబు నపహసించు.
తే. నిటులు గాత్త్రికదేశము లటమటించు
సార వారవధూటికా సామ్య మొప్ప
మనుజలోకంబునం దుండు మానవతు ల
నంగ నేపాటి? దీనిఁ జెప్పంగ వశమె! 81
సీ. చెలియ పెన్నెఱి గుంపుఁ జేపట్టఁ గలిగెనా
ఘన సంపదలు వేడ్కఁ గాంచినట్లు;
కాంతమోమున మోముఁ గదియింపఁ గల్గెనా
యతులిత రాజత్వ మందినట్లు;
ముద్దియ కన్దోయి ముద్దాడఁ గల్గెనా
యింపుమైఁ గువలయం బేలినట్లు;
వనిత కంఠాశ్లేష మొనరింపఁ గల్గెనా
యరుదారఁ బెన్నిధి యబ్బినట్లు;
తే. కలికి కెమ్మోవి చవిఁ జూడఁ గలిగెనేని
యురు సుధాహార వైభవం బొందినట్లు;
నెలఁతతోఁ గూడి జీవింపఁ గలిగెనేని
యతను సామ్రాజ్య మంతయు నమరినట్లు. 82
ఉ. అందపుఁగాను శ్రీహరి నహర్నిశముల్ భజియించి తత్పదం
బందె నటంచుఁ, జన్గవ తదాకృతిఁ గాంచె గిరీశుఁ గోరి, యా
రుం దగఁ జూచి రెంటఁ బడి రూఢికి నెక్కుట యెట్లటంచుఁ దాఁ
జెందె నహీనవృత్తి సువిశేషత నిర్వ్రణరుం బ్రియంబుగన్. 83
చ. వనజమహావిభూతి హరి వైఖరిఁ గాంచుఁ బద స్తనోత్కరుల్
వనజమహావిభూతి హరి వైఖరి మించుఁ గళోరు వేణికల్
వనజమహావిభూతి హరి వైఖరి నెంచుఁ గరాక్షిమధ్యముల్
వనజమహావిభూతి హరి వైఖరి నొంచు దృగాస్యయానముల్. 84
సీ. ఈ భామ వదనాబ్జ మెలమిఁ గాంచినయంత
విధుని సంభావించి వెలసినట్లు;

ఈ చాన నెఱికురు లెనసి పట్టినయంత
నీలకంధర సేవ నెగడినట్లు;
ఈ యంబుజాక్షి కన్దోయి ముద్దిడునంతఁ
గమలజ సద్భ్యాతి గలిగినట్లు;
ఈ రామ కెమ్మోవి యింపార నంటిన
నరుణ బింబాలోక మమరినట్లు;

తే. అవుర తన కింతకంటె భాగ్యంబు గలదె!
యతను మంత్రాధిదేవత యనఁగ వచ్చు
నీ చెలియచేతఁ గోర్కు లీడేఱుఁ గాత!
వేఱు మదిఁ బూని తపముఁ గావింప నేల! 85

సీ. సారంగముల మీఱు సారంగములఁ గేరుఁ
దొయ్యలికొప్పు కన్దోయియొప్పుఁ;
బున్నాగముల నొంచుఁ బున్నాగముల నొంచు
నలినాస్యగతిసొంపు నాభిపెంపు;
చంద్రఖండము నేలుఁ జంద్రఖండముఁ బోలు
సుదతిచెక్కులలాగు నుదుటిబాగుఁ
గాంచనంబు హరించుఁ గాంచనంబు హసించుఁ
దరళలోచననాస తనువిలాస

తే. మవుర యీముద్దుఁజెలి నేలినట్టివాని
భాగ్య మెన్నంగ వశమె! యా పద్మభవుఁడు
దీని సృజియించువేళ వా గ్దేవి నెదుట
నుంచుకొని చేసెఁ గాఁబోలు! నొండు గలదె! 86

ఉ. దీనిముఖాంబుజంబు గణుతింపఁ గళానిధి యొక్కకోణమం
దూని వసించుఁగాక, నయనోద్గతి హాకొనఁ గల్వ లొక్కచో
మూనుగ నిల్చుఁగాక, మృదుమంజులవాగ్గతిఁ జెప్ప వల్లకీ
స్వాన మటుండుఁగాక, మిను చాయకు క్రొమ్మొక్కైద మధ్యమెన్నఁగఁగా

26655 / 25.3.73.

సీ. ఊహించి పున్నమ యొక్క ప్రొద్దుంబునో
ముద్దియ నెమ్మోము ముద్దులాడఁ;
దనరార సత్ఫల దానమ్ము లిత్తునో
నలఁత కెమ్మోవి తేనియలు గ్రోల;
బంగరు కలశముల్ పరఁగఁ బూజింతునో
పడఁతి చన్గుబ్బలు పట్టి యాడఁ;
జెలువొంద భూప్రదక్షిణము గావింతునో
యాతివ కటిస్థలి నధివసింప;
తే. ఇటులు గాకున్నఁ గల్గునే యింతితోడి
సంగతి యటంచు దమి మీఱ నంగజాత
జాత తాపాతిశయమున సతిని మతిని
మమతఁ బెనఁగొని వర్ణించె మఱియు మఱియు. 88

సీ. పొలఁతిపాదములతోఁ బొత్తు సేయఁ దలంచి
తామరల్ పరికించి తెమ్ము లయ్యెఁ;
గలికిపాలిండ్లతోఁ జెలిమి సల్పఁగఁ గోరి
భావించి చక్రముల్ పక్షు లయ్యె;
సుదతి కెమ్మోవితో జోడు గూడఁగఁ బూని
చెలఁగి మంకెన బంధుజీవ మయ్యె;
హరిణాక్షి నెమ్మోము నాశ్రయింపఁగఁ జూచి
మిహికాంశుఁ డించు సన్మిత్త్రుఁ డయ్యెఁ;
తే. చంద్రముఖి యంగములు పంకజాతము లని
యరు లని విహీనగుణ మని భరితదోషుఁ
డని కదియ దూరముగఁ జేసె నాత్మ నిత్య
మ్మవల సుస్నిగ్ధతా స్మిత విదితకళల. 89

ఉ. పట్టుగ నీ వధూటి కచ పాళి భజింపఁగ నీలమేఘ మే
గుట్టులఁ జెందునో, ముఖముఁ గోరి నుతింపఁగఁ బూర్ణచంద్రుఁ డే

తట్టునఁ జేరునో, మఱియుఁ దార్కొని యారు దలంపఁ బాము లే
పుట్టలఁ దూఱునో, సమతఁ బూనఁగ లేక విచిత్రవైఖరిన్. 90

మ. సతి హృత్పుష్కర సీమఁ జన్గవ గిరీశ ప్రార్థనల్ సేసి త
ద్గతిఁ బ్రాపించిన, నోర్వమిన్ విషధరాకారంబుఁ దాఁ బూనె నా,
రతిపంచాననలీలఁ దాల్చె నడు, మాహా యంచు ధమ్మిల్ల మా
శితికంఠత్వము నొంద, నెమ్మొగము గాంచెన్ సోమభావం బొగిన్.

సీ. కాఁబోలు నిదియుఁ జొక్కపు సుధాకర రేఖ;
కాదుపో నిష్కళంకతఁ జెలంగెఁ.
గాఁబోలు నిది యశోకపుఁ దూపు దొర మాయ ;
కాదుపో సశరీర గరిమఁ దనరెఁ.
గాఁబోలు నిదియుఁ జక్కని వేల్పుఁబూఁబోఁడి ;
కాదుపో విభ్రమేక్షణము లొదవెఁ.
గాఁబోలు నిదయుఁ దొల్కరి తీవియ మెఱుంగు ;
గాదుపో నిశ్చల గతిఁ దనర్చె.

తే. ననుచు రతిపతిమోహామృతాంబురాశి
మగ్నుఁడై విస్మయాక్రాంత మానసాబ్జుఁ
డై సరోజేక్షణా రూప మరసి యరసి
నేర్పు మీఱంగ మఱియు వర్ణింపఁ దొడఁగె. 92

చ. కడువడి రాహు వేర్చి నవకంజవిలోచన యాస్య చంద్రు నే
ర్పడర హరింపఁగాఁ దొడరి, యస్మదరాతి కలంకి యంచు నే
ర్పడ మదిలోఁ దలంచి, మఱి గ్రమ్మఱి వెన్నున నిల్చెనో యనన్,
జడ యలరున్, ఫణాగ్రరుచి చాడ్పున రాకిడి బిల్ల పైఁ దగన్. 93

తే. కళలకు ధామమై జలజగర్వ మడంచి సుధాప్తిఁ దారకా
కలనఁ జెలంగి తెల్విఁ గని కాముక పాళికి గుండెగాలమై
యలరెడు భామినీ వదన మైందవ బింబ మనంగఁ జెల్లదే?
కలయఁగఁ గానిచో నచటఁ గన్నుల పేరిటి కల్వ లొప్పునే? 94

చ. కలువలు మీలుఁ దుమ్మెదలుఁ గాంత కనుంగవ కోడి క్రందుగా
వలసినకోర్కి దీని గెలువం దగుధీరుఁడు మారుఁ డంచుఁ దూ

పులుగ, ధ్వజంబుగా, గుణము పొందికగా, నయి వచ్చి దాని భ్రూ
చలనముతోన తద్ధనువు సంగతిఁ దప్పినఁ బోయె సన్నియున్. 95

వనిత ముఖాంబురుహ స్థితిఁ
బనిగొని కాముకుల గెలువ భావజుఁ డెలయుం
దనయుభయ పార్శ్వముల ని
ల్పినచక్రములో యనంగఁ బీనులు దనరున్. 96

శా. భ్రూ కోదండముఁ బూని దృష్టి విశిఖంబుల్ తోనె సంధించి బ
ల్లాకా చంద్రునిఁ బట్టి రెండు తునియ ల్గావించి తత్సారముం
బోకుండ న్సవరించి పార్శ్వముల నింపుల్ నింపఁగా నుంచె నా,
నీ కంజేక్షణ చెక్కుటద్దము లురున్ హేరాళపు న్దళ్కులన్. 97

చ. వర సుమనో విలాసముల నైఖరి మాని తిలోత్తమాఖ్య యీ
ధర సుమనోవిలాసములఁ దద్దయుఁ గాంచెద నంచు వచ్చి యు
ద్ధురగతి నువ్విమాఁకుల నధోముఖి యై తప మాచరించి యీ
కరివరయాన నాస యయి గాంచె సమస్త విశేష వాసనల్. 98

సీ. క్షణవిలాసమె కాని సరి యౌనె చిగురాకు
సుమనోనురాగ విస్ఫూర్తిఁ గనినఁ?
బయిచాయయే కాని పగడంబు సాటియే
యమృతాకరద్వీపమందు మనినఁ?
దీప్పువన్నె లె కాక దీ టౌనె బలుకెంపు
వరసువర్ణావాప్తి వఱలుచున్న?
నెఱుపుమాత్రమె కాని యీడౌ బంధూకంబు
కమ్రదేనియతోడఁ గలసికొనిన?

తే. సతతశోభాన్వితం బయి సార మగుచు,
సరస మై రుచి గన్పట్టి చక్క నగుచుఁ,
జక్కెరల మించి ద్రాక్షపం డుక్కడంచి,
యమరు నీ వనితామణి యధరమునకు. 99

క. కుందంబుల, నవమౌక్తిక
బృందంబుల, దాడి మ్మెక బీజంబుల యీ

యందంబుల, జిగికెంపుల
చందంబుల, నపహసించు సతిదంతంబుల్. 100
చ. అతులిత మైనశంఖము సముంచిత గానము నేర్పు మంచు నీ
యతివ గళంబుఁ జెంది తనయందలి వైభవ మెల్ల నిచ్చి త
ద్గతిని భజించి యట్లు పలుకన్ రహిఁ బొల్పడ దయ్యెఁగా; జడ
స్థితులకు సిద్ధులే స్థలవిశేషములం దప మెంత సేసినన్? 101
తే. మున్ను తను సేఁచు పగఁ బూని మోముఁదావుఁ
జెందునిందునిఁ గరము లన్ శ్లిష్టకుసుమ
బిసలతలఁ గట్టి యొగఁదన్ని యసము మీఱు
చక్రయుగ మనఁ జనుదోయి చామ కలను. 102
తే. వనిత గంభీర సరస లావణ్యవార్ధి
యురు సుధాపూర్ణ కుచకుంభ యుగముఁ గాంచి
సకల లోకుల మిగుల నిర్జరులఁ జేయు
నేక కలశంబుఁ గాంచుకంధిసుఁ దెగడి. 103
మ. స్మరుఁ డన్విప్రుఁడు యౌవనం బను తనూజాతోద్గతిన్ బాలన్యను
న్పురుడుం దీర్ప శుభావ హాద్యరస మన్పుణ్యాహముం జేయుచో
వరుస న్నిల్పిన పూర్ణహేమకలశ ద్వంద్వంబు నాఁ బొల్చు నీ
సరసీజాస్య పయోధర ద్వయము భాస్వత్పత్త్రరేఖాంకమై. 104
తే. ముగుద బాల్యపయోనిధి మునిఁగి డాఁగి
యౌవనం బను హరిహయు నలరు కృపను
జెలఁగి వెలువడి వచ్చిన శిఖరు లనఁగఁ
గాంత యురముసఁ గుచములు గానఁబడియె. 105
తే. పడఁతి జఘనంపుఁ బెద్దడాబాలు పూని
కాయజుఁడు నాభి యనుసురంగమునఁ దూటి
తెగువఁ గుచ దుర్గ యుగము సాధించుకొఱకుఁ
దార్చు నిశ్రేణి యన వళిత్రయము సెలఁగు. 106
చ. చెలిబలితంపు గబ్బినలి సిబ్బెపు నిబ్బర పుబ్బు గుబ్బచ
న్నుల నెఱగొప్పభారమున నున్నని తిన్నల మించు బళ్ళిఱుం

దుల నసియాడుకొను పడునో యనుశంక సరోజ సంభవుం
డెలమి రచించి కీల్గొలుపు నిన్ను నలా కన నారు తీరగున్. 107

చ. అరయఁగ నాభిపుష్కరమునందు విహారము గొంత సల్పి సుం
దరతరయౌవనం బనువనంబున బాహులతల్ దలిర్పఁగా
సరసపయోధర స్తబక సంగతిఁ గమ్మనితావి కేక వి
స్వరగతి నేఁగు తుమ్మెదల బారన నారు చెలంగు బోటికిన్. 108

చ. జడ యనుతోఁక వెన్కఁ దగ నారపుఁ గుంకుమ జాజు రేఖ యే
ర్పడఁగ, మిటారి గుబ్బ లను భారపుఁ గుంభము లంద మొందఁగాఁ,
దొడరెడు నారు సారనెడు తుండము సాఁచి మనోజ దంతిరా
జుసుగక నీరు ద్రావఁగొలనో యన నాభి చెలంగు నింతికిన్. 109

మ. చెలి సింగారపుఁ బువ్వుఁదోఁట రసముల్ చెల్వొప్పఁగా నింపఁ బూ
విలుకాఁ డన్నలుకాఁపు గుబ్బ లను మేల్బిరంపుబెడ్డల్ ఘటిం
చి లలిన్ నీలపుటారుమో కెలమిఁ బుష్టి న్బట్టి మోపెత్తు మె
చ్చుల చెంగల్వకొలంకు నాఁగఁ బసమించు న్నాభి గంభీరతన్. 110

క. చనుఁగవ బరువో, యొండెం
బెనఁకువ గల శోభనాంగ పిఱుఁదులు బరువో,
యని కన విధి పిడికిటఁ బ
ట్టినపట్టో యనఁగఁ గౌను తేవన్ వెలయున్. 111

మ. జననాథాత్మజ యూరు కాండ యుగళీ స్తంభాగ్రభాగంబుపైఁ
బెనుపై ముత్తఱు లంతరాళముగ నాభీద్వారమం దొప్పఁగా
స్తన జాంబూనద కుంభ గుంభిత తనూ సౌధాంతరస్థాయి మా
రుని సింహాసన మో యనంగఁ జెలువారుం గాంచిదేశం బొగిన్. 112

తే. మరుఁడు శృంగారపీఠు లమర్చి తనదు
పేర నొకపేటఁ గట్టి సంప్రీతిఁ దోర
ణాల నుంచినఁ గ్రాలుకంబా లనంగఁ
గలికియూరులు చెలఁగుఁ బైఁ గాంచి మెఱయ. 113

క. మకరములను లోనంగొని
రకముగ వరశాలులను ధరం బడవై చెన్

సకి జంఘిక లని యెంతయుఁ
బ్రకటించెం గాహళులు రవంబుల దిశలన్.

తే. నెఱియ సారసములు దమ్ము నేలఁ బెట్టి
కాల రాచుచు నున్నాఁడు కలువలచెలి
వెతలఁ బడఁ జాల మీఁది రాహువేణి యనుచు
నతివపదములఁ బడె నన నడుగు లమరు.

తే. నిరవలంబంబు తమయుండు నిలయ మెల్ల
నందు నిలు వాదరువు లే దటంచు వగచి
వచ్చి తారక లొకకొన్ని వనితపదము
లందెనో యన వ్రేళ్ల నఖాళి యమరు.

వ. అని మఱియు నిట్లనియె.

సీ. చెలియపెన్నెఱిగుంపు చీఁకటిఁ దలఁ దన్నె,
వదనము కళఁ బట్టి చదిపె విధునిఁ,
చెలువకన్నులు లేళ్లఁ జెవి వట్టి యాడించెఁ,
గర మొప్పు గళము శంఖంబు నూఁదెఁ,
బాలఁతిచన్నులు చక్రముల ఱొమ్ము వెసఁ ద్రొక్కె,
నారు సర్పముఁ గడు నంటి పోడిచెఁ,
జెలికటి సైకతముల వెన్కఁ బడ నెత్తె,
నడుగులు నెత్తమ్మి నడుసున నిడె,
తే. మిసిమిబంగారుపై నెక్కె మేనిచాయ,
యే మనఁగ వచ్చు నిక్కాంత యింపు సొంపు
మించు నవయవ సౌష్ఠవం బెంచి చూడ
వశమె వేనోళ్లు గల ఫణివరున కైన!

తే. కురులఁ గుటిలత గావించెఁ, గుచములందుఁ
గఠినత విధించె, సారస గర్భుఁ డెలమిఁ;
జెలఁగి యీకాంత మన సట్లు చేయఁడేని
యతనిఁ బుడమిని జతురాస్యుఁ డనఁగ వచ్చు.—

—* కామిని మూర్ఛఁ దేఱి కవిని వలచుట *—

క. ఈరీతి బిల్హణుండు మ
హారూఢి నిజానుభావ మభినుతి సేయం
గా; రామ తద్వచోమృత
సారంబున మూర్ఛఁ దేఱి సంస్మృతి గలదై. 120

తే. యామినీపూర్ణతిలక యత్యంతపులక
దేహ యై లేచి మదిని సందేహ మెడలి,
యజ్ఞుని హసించు కవివదనాబ్జ మమరఁ
గాంచి యూహించె నిజ విలోకాంచితముగ. 121

తే. చదువుఁ జెప్పఁగ గురుఁ డయ్యె సరసగతిని,
జూడఁ జూడంగ మరుఁ డయ్యె సోయగమునఁ,
దలఁపఁ దలఁపంగ రా జయ్యెఁ గలితకళల,
నింతయు నెఱుంగనైతి హా యింతదనుక. 122

ఉ. ఏ లఘుచిత్తనై కదిసి యీనవమోహనరూపు సన్నిధిన్
బాళిని జేరుచో, నితనిభావ మ దెట్టిదొ కాన రాదుగా;
లీలఁ బరిగ్రహించునొకొ లేక గ్రహింపక పోవునొక్కొ? నేఁ
దాళఁగఁ జాల; నింతి తను దాన దొడంగినఁ జుల్క నౌఁగదా. 123

వ. అని మఱియును. 124

ఉ. ఏగతిఁ బోవుదాన? మఱి యీతని నేగతిఁ బల్కుదాన? నా
లాగు మదిం దలంపక కళానిధి కాదని పల్కె నా, పయిం
గాఁ గలకార్య మెట్టిదొకొ? కాసియెడం దన మాన మెట్టు లెం
తాగడ మాను? యిందులకు నన్యవిచారము లేమి సేయుదున్? 125

వ. అని యివ్విధంబున వితర్కించి. 126

ఉ. రాజకుమారికామణి విరాళిని దాళఁగ లేక తూలి, సం
యోజిత కాండవస్త్ర ముపయోగము లేమికిఁ ద్రోచి వైచి వే
రాజితశయ్యపైఁ బడి సరాగము గా విలపించె నాత్మభూ
రాజ శరాళికిన్ నిలుప రానితమిన్ భ్రమ ముప్పతిల్లఁగన్. 127

తే. 'హా కళాకాంత, చతురాస్య, హా కఠోర
మార నిశిత శరాళి వేమాఱు నాటి
కలఁచె సంతాప మొదవ; న న్గరుణఁ జూచి
ప్రేమఁ గొనవయ్య బాధఁ దప్పింపవయ్య.' 128

వ. అని నర్మగర్భంబు గాఁ బలికిన, నప్పలుకులు కఠోర మారవీర దోర్దట
చ్చాప గుణ టంకార నినదంబులుగా విని, భావంబు గ్రహించి సంచ
లిత హృదయుం డయి కవిపుంగవుం డి ట్లనియె.— 129

—* కామినిని కవి వలచుట *—

ఉ. 'తామరసాక్షి, నీ నిశిత దారుణ వీక్షణ తీక్ష్ణబాణముల్
వేమఱు నాటి నాహృదయవీథి వ్రణం బొనరించెఁ; జూడుమా
నీమెయి నౌషధ ద్వితయ మియ్యవె; త్రావెదఁ, బూతఁపూసెదన్,
నీ మధురాధరామృతము, నీ కుచకుంకుమ పంక మేర్పడన్.' 130

వ. అని మఱియు ని ట్లనియె. 131

సీ. 'కరుణతోఁ ననుఁ జూచి కాయజు శరహతిఁ
దప్పింపు మిప్పుడు తరళనయన,
చిఱునవ్వు వెలయించి చెలు వైనవెన్నెలల్
మాయింపు మిప్పుడు మచ్చెకంటి,
పలుకులు వగ గుల్కఁ బల్కి పైకధ్వనుల్
మాన్పవే యిప్పుడు మధురవాణి,
మోవిపానక మిచ్చి మోహ దంభక తృష్ణఁ
దీర్పు మిప్పుడు మోవితీపులాఁడి,
తే. కరము లలరించి బిగియారఁ గౌఁగిలించి
యొడలిచలిఁ బాపవే భాస్వ దురసిజాత,
యతను సామ్రాజ్య మేలించి యాదరించి
వలపు లీడేర్పవే హేమ లలిత గాత్రి.' 132

వ. అని మఱియు ని ట్లనియె. 133

తే. 'రమణి, మీతండ్రి మదనాభిరామనృపతి
చేసినట్టివినోదంబు చిత్ర మయ్యె;
చిత్తమున వేఱు తలఁపక చెలఁగు మతుల
గతుల భయ మింత వల దిట క్షితిపువలన.' 134

వ. అని మరల రసావేశంబునఁ దద్వదన శశాంకమండలంబు నాలోకించి యి ట్లనియె. 135

తే. 'నెమ్మిఁ దపము గావించితి నిన్నుఁ గూర్చి,
జపము సల్పితి నీ పేరు చాలఁ దలఁచి,
ధ్యాన్య మొనరించితిని వార కాత్మ నునిచి
మంత్రదేవతగా నిన్ను మంజువాణి. 136

వ. అది యెట్లంటేని. 137

సీ. సరవి నెన్నఁడును భోజనము సేయఁగ లేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి,
ఎలమిగా నెన్నఁ డింతులను జూడఁగ లేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి,
అరయ నెన్నఁడుఁ జందనాదిఁ దాల్పఁగ లేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి,
చెలఁగి యెన్నఁడు మాల్యములు ధరింపఁగ లేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి,
తే. కాన భవదీయ విరహ యోగమున నాకుఁ
గలహారిత్తులు మసకట్లు గాఁ దనర్పుఁ,
గాంచి నమ్రుఁడ నైన స త్కవిని నన్ను
రాజసము మాని ప్రోవవే రాజపుత్రి.' 138

—* గాంధర్వవివాహము *—

వ. అనిన దరహసిత వదన యయి కుందరదన యి ట్లనియె. 139

క. 'కవిరాజశిరోభూషణ,
దివిష ద్రాజాస్య లైన దీవ్యద్భవద్

యవరాకృతిఁ గని యేఁకా
రి వలతు రే నఁగ నెంత శ్రీతనయసిభా.' 140

తే. పరఁగ నీరీతి రతి మనోభవునిఁ బోలె
యామినీపూర్ణతిలక బిల్హణకవీంద్రుఁ
బెండ్లి యై యెల్లవగల సేవించుచుండె
దినదినంబును బ్రేమ వర్ధిల్లుచుండ. 141

క. తారాయనతటినీ శర
తారాయన శిఖిశిఖాంక ధాత్రుజ హారిరా
ట్తారాచల నాయక గి
స్తారాచల రాజరాజ సఖ సత్కీర్తీ. 142

—*భుజంగ ప్రయాతము *—

కథావిప్రధానా ప్రకాశాభిధానా
బుధారాధితార్థా ప్రభూతాఖిలార్థా
విధుస్ఫారకీర్తీ సువిద్యానువర్తీ
సుధామాధురీవాగ్విశుద్ధానుభావా. 143

(గద్య)

ఇది శ్రీ సీతారామ చరణ సేవాప్రభావ
సంపాదిత కవితా విచిత్ర కాశ్యపసగోత్ర పవిత్ర
శ్రీమత్పండిపెద్ది కృష్ణస్వామి ప్రణీతం బయిన
బిల్హణోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

140 శ్రీరస్తు.

# బిల్హణీయము.

141 ## తృతీయాశ్వాసము.

క. శ్రీమహిత రూప జిత శత
142 కామా, కామాంధకార గర్వోద్ధత సు
త్రామారి మద నిషూదన,
క్షేమంకర దివ్యనామ సీతారామా. 1
తే. అవధరింపుము తదనంతరావధాన
మహిమ బిల్హణకవితోడ, మంజువాణి
143 యామినీపూర్ణతిలక విహార గరిమఁ
దనరు చున్నంతఁ జెలులు తత్కార్య మెఱిఁగి. 2

—*చెలులు రాజపుత్త్రీ బిల్హణుల దాంపత్య మెఱింగి రాజున కెఱిఁగించుట*—

క. 'ఓకమల నేత్ర, వింటే
యీకవి సన్నిధిని సరసిజేక్షణ యెంతో
చేకొని విద్య గ్రహించుటఁ
గాక మఱియు నిపుడు తెగువ కార్య మొనర్చెన్. 3
తే. ఇందుకై యేమి యందుమో యిందు వదన,
విభున కెఱిఁగింపఁ దగుఁ గవివిభుని నడత;
మనకు దాఁపంగ నేటి? కేమనఁగ వలసి
మీఁద నెటు వోయి యెటు వచ్చునో దలంప.' 4
వ. 'అని యొండొరులతోఁ బలికికొని తర్జనీ కలిత నాసాగ్రలై నుదుక్కు-
మనుచు రాజసాన్నిధ్యంబున కేతెంచి మ్రొక్కి, ప్రసన్న వదనుం డైన

యన్నరపాలుసుతో, గద్గదకంఠయై విన్నపం బాకర్ణింపుఁ డని, వారిలో
నొక్కఁబోటి యి ట్లనియె. 5

తే. 'రాజరాజేంద్ర మదనాభిరామనృపతి,
దేవరకుమారి యాకవిభీమువలన
విద్య యభ్యాస మొనరించువేళ బద్ధ
కాండపట మంకుశము గాఁగఁ గపట మొదవె. 6

చ. ఎఱుఁగఁగరాదు దైవకృత మెట్టిదియో. మన మంజువాణి తా
గుఱిగొని యద్ధరామరునిఁ గూడిన యట్టులు మాకుఁ దోఁపఁగా,
గుఱుతు గ్రహించి యీవిధము గోప్యముఁ జేసిన హానివచ్చు సం
చలిమునఁ జెప్పవచ్చితి జనాధిప, యే మిఁక బుద్ధి మీఁదటన్?' 7

వ. అనిన విని యత్యంత కంపిత స్వాంతుండై భూకాంతుండు నిట్టూర్పు
లెసంగఁ దనలో నిట్లు దలపోసె. 8

క. 'ఏ నొనరించిన దేమది?
యైనవిధం బేమి? యాఱ డాయెను భువిలోఁ.
దా నొకటి తలఁపఁ దైవము
తా నొకటి తలంచు ననుట తథ్యము గాఁగన్.' 9

వ. అని వితర్కించి వారలం బనిచి పుత్త్రికామణి సమీపంబునకు వచ్చి
నిలిచి యిట్లనియె. 10

—* రాజు కూఁతుకడకు వచ్చి నీతులు పలుకుట *—

శా. 'పట్టీ, రాజకుమారశేఖరులఁ బిల్వం బంచి భూపాలకుల్
చుట్టాలు న్మది మెచ్చఁగా నగరమున్ శోభిల్లఁగాఁ జేసి మే
ల్పట్టం బిట్టముగా స్వయంవరమునన్ భూషించి నిన్ బ్రేమ నే
నెట్టో సేయఁ దలంచితిన్ ముదముతో నిచ్ఛానురూపంబుగన్. 11

ఉ. కోరినరాకుమారకునకుం బ్రియ మందఁగ నిన్ను నిచ్చి యెం
తే రహి మీఱ సౌఖ్యమున నుండెద నంచుఁ దలంచి యున్న నా
కోరిక లెల్లఁ బోనడిచి కొంకుఁ గలంకము లేనిమత్కులం
బారఁగ దుర్యశంబు మహి నందఁగఁ జేసితివమ్మ బాలికా.' 12

వ. అని పలుకుచున్న జనకునిఁ జూచి పుత్త్రికామణి యిట్లనియె. 13

—* రాజపుత్త్రి రాజుతోఁ దాను దోషరహిత యని చెప్పుట. *—

శా. 'అయ్యా, యెన్నఁడు లేనివార్తలివి యే మత్యంతముం బల్కెదీ.
వయ్యా నీవొనరించుకృత్రిమమె నీయాత్మవ్యథం జేయు. నా
యియ్యాస్యాబ్జము చూడ నీమదికి సుంతే సందియం బాఱెనో ?
వ్రయ్యుర్ నాశిర మిందు మాయెడ నధర్మం బించుకేఁ గల్గినన్. 14

క. ఏ మయ్య యేమి? వింటివి?
యేమహిపా యెటులు దోఁచుచున్న ది నీకున్ ?
మామకచిత్తము దెలియవె?
నామది సంశయము లేదు నవ్యవిచారా.' 15

వ. అనినఁ గరుణాయత్తచిత్తుండై రాజోత్తముఁ డిట్లనియె. 16

చ. తొడరఁగఁ బూర్వ మే మయినదో యది వోవఁగ నిమ్ము పుత్త్రి. నిన్
గడవఁగలేను; వంశము వికారము సేయక యింకనైన నీ
నడతలు మాని యుండు స్థుమనఃస్థితి; సత్కులసూతి కిచ్చి ని
య్యెడ నొకరాకుమారునకు నిచ్చెద నిన్నుఁ గృపామతిం దగన్.' 17

వ. అనిన విని మనం బొప్పక శంకారహితచిత్తయై మత్తగజయాన యి
ట్లనియె. 'అయ్యా, ఆకవికే నన్నిచ్చి యథావిధి వివాహంబు నెఱ
వేర్చి నీకృపం జూపుము. నేనా యగ్రకులునికి క్షత్త్రకన్యోచిత విధా
నంబున భార్య నైతి. 18

—* కాంత తాను కవిం బెండ్లియైతి ననుట *—

మ. ధరణీపాల వచించెదన్ వినుము చిత్తంబక్షులున్ ఘ్రాణమున్
వరజిహ్వాశ్రుతు లంచితం బయినసంస్పర్శంబు నాధీరునం
దు రసిన్ నిల్చెను బుద్ధిపూర్వకముగాఁ, దోడ్తోడ నిం కేది కే
కరణిం జేర్చెదు చేతనారహిత మీకాయంబు నాయంబుగాన్. 19

వ. అనిన విని రోషారుణితాయతాక్షుండై నరాధ్యక్షుండు శీఘ్రంబుగా
సభాస్థలంబునకు వచ్చి కుపితమానసం బైన నసింహంబుకరణి సింహాస
నాసీనుండై సభాసదులం గలయం గనుంగొని యిట్లనియె. 20

—* రాజు కుపితుండై సభాసదులతో నాలోచించుట *—

తే. 'అమర నంతఃపురద్రోహ మాచరించు
వాని నే శాస్తి సేయంగ వలయు? మీరు
ధర్మపద్ధతిఁ బలుకుఁడుఁ దగినశాస్తి
సేయుదము వాని సద్గుణశ్రేష్ఠులార.' 21

వ. అనిన విని సభాస్తారులు గలంగి మనంబున ఘనంబుగాఁ దోఁచి యాలోచించి యిట్లనిరి.

క. 'కార్యాకార్యము లెఱుఁగక
మర్యాదలు నడపువాని మహిపతి యొంతే
నార్యానుమతిని హింసవద
థైర్యా దండింపవలయు దండధరుండై.' 22

వ. అందు నొకకొంద ఱిట్లనిరి. 23

క. 'ధరణీశ విచారించిన
ధరణీతలమందు నన్ని తప్పులె చూడం
గరుణించి కానవలయును
బరికింపఁగ నెట్టులైన భవ్య విచారా.' 24

వ. అనిన మఱికొంద ఱిట్లనిరి. 25

ఆ. 'లేఁత ముదు రెఱింగి నీతిఁ దండింపఁగా
వలయుఁ గొన్ని, మానవచ్చుఁ గొన్ని,
మానఁ దగవుఁ గొన్ని, మహిమీఁద ధరణీశ
యొంతకార్యమైన నిదియె హితము.' 26

వ. అనినఁ గొందఱు రాజభావం బెఱింగి యిట్లనిరి. 27

క. 'ఏకార్యమైన మానవ
లోకోత్తర యమునిరీతి లోకంబున నా
లోకించి దుర్జనావళిఁ
గైకొని దండింపకున్నఁ గలుషము వచ్చున్.' 28

వ. కావున శిక్షాకరణంబు కర్తవ్యంబు.' అనిన విని రాజు కోటపాలకులం బిలిపించిన. 29

సీ. గండ్రగొడ్డండ్లు గొంగళ్లును జికిలిచ
ల్లాడముల్ నైలచల్లాడములును
గుజుచుంగుల తలగుడ్డలుఁ గావు బొ
ట్లినుపకడేలుఁ బ్రాళ్లినుపదుఘ్లు
నీలికాసెలు మెడనీలికుచ్చుల త్రాళ్ళు
బిరుదైన వడిసెలల్ బిల్లమెట్లు
కాఱుమేనులు బలుకోఱమీసములును
బిగినంపు చూపులు బెట్టుగుస్లు

తే. నొడలఁ గోరోచనపుఁబూఁత లుట్టిపడఁగ
వచ్చి, తలవరు లెల్లను మెచ్చు దొరయ
నిలిచి చేతులు మొగిడించి నేర్పుతోడ
దండ మిడి యొాగ రైరి యున్న ధరణివిభుఁడు. 30

వ. అందు వీరసేనుం డనునొకతలారినిం జూచి యిట్లనియె. 31

—* రాజు బిల్హణునికి శిరశ్ఛేదం బాజ్ఞాపించుట *—

శా. 'ఓరీ, బిల్హణనామధేయకవి నుద్యోగించి రాఁ దీసి దు
ర్వార స్ఫూర్జిత దీర్ఘ పాశములచే బంధించి కొంపోయి బల్
దూరం బయిన శ్మశాన వాటిముఖ నూలోకింపకే నిర్దయా
ధారస్వాంతుఁడ నై తదీయశిర ముద్దామాసి ఖండింపుమా,' 32

వ. అని ముష్టాఱుఁ బలికి పొమ్ము పొమ్మని సెల వొసంగిన; వీరసేనుం డిట్లనియె. 33

క. 'కోపనుచే శిక్షింపను,
భూప, యనుగ్రహముచేతఁ బ్రోవఁగ దక్షుం
డేపట్ల నృపతి వసుమతి;
నీపద్ధతి నరసిచూడ నితరము గలదే. 34

క. దేవర యేమి వచించిన
నావిధ మొనరింతు మేము నది యెట్టిదో మీ
భావము యోగ్యాయోగ్య వి
భావముగాఁ గానవలయుఁ బరహితబుద్ధిన్.' 35

వ. అనిన భూపాలుండు కోపించి యావలి మొగం బైన, వీరసేనుండు. 36

క. 'భూపాలుఁడు సెప్పిన విను;
డా పాపము పుణ్య మంత యవ్విభునిదె; తా
రూపించినట్లు సేయుదు;
నీపట్టున దైవయోగ మెట్లున్నదియో?' 37

వ. అని తద్గృహంబుఁ జొచ్చి. 38

తే. పుస్తకము చేతఁ బూని తత్పూర్వకార్య
మెఱిఁగి తనలోన సతి భజియించువాని
నోడిఁగి శయ్యాతలంబున నున్నవాని
బిల్హణునిఁ జేరఁ దలవరి బెగడ ననియె. 39

క. 'ఓకవిరాజశిఖామణి,
నీ కొక్కటి విన్నవింతు, నృపవరుఁడు నినుం
జేకట్లు కట్టికొని చని
యాకడ దండింపు మనుచు నాజ్ఞ నొసంగెన్. 40

తే. దేవ, నీపట్ల యిది యేమొ తెలియరాదు;
చెప్ప నెంతయు వినఁడాయె; శీఘ్రగతిని
లె మ్మనుచు డాసి వాఁడు చేదమ్మి పట్టి
తిగిచి యురుపాశములను బంధించె నంత. 41

తే. కవివరుఁడు లేచి దిక్కులు కలయఁ జూచి
మంత్రదేవతఁగా నారమణి నిజాత్మ
నిలిపి తలవరివెంబడి నిశ్చలమతిఁ
జనియె నచ్చటి జనములు సందడింప. 42

వ. అప్పు డొక్కసఖి త్వరితగతిం జని రాజపుత్త్రితో నిట్లనియె. 43

శా. 'అక్కా, బిల్హణుఁ గోటపాలకులు ప్రాజ్యస్ఫూర్తి దుర్వారులై
చిక్కం బట్టి మహోగ్రపాశముల నాక్షేపించుచున్ బాహువుల్
ప్రక్కల్ త్రొక్కలు మొక్కలంబుగ వెసన్ బాధించి చేముట్టి యీ
చక్కిం బోవుచునున్నవా రిదె సఖీ, శక్యంబె వీక్షింపఁగన్.' 44

వ. అను పలుకులు చెవులకు ములుకులు సొనిపినట్టివి యయిన, హా హా కారంబు నొంది, యిందులకు నెక్కార్యం బని విచారించి దిగ్గన లేచి.

—* రాజపుత్త్రి కవిం గావు మని తండ్రికి మొఱ యిడుట *—

చ. నను మసియాడ, నెమ్మొగమునం జెమటల్ జనియింపఁ, బాదముల్
తడఁబడఁ, బైఁట జాఱఁ, గనుఁదమ్ముల నీరు దొలంక, వేణియు
న్విడివడి తూలియాడ, నవనిం బడి లేచుచు, నెగ్గుతోడ న
ప్పుడఁతుక సేర వచ్చెను సభాస్థలి రాజ సమీప భూమికిన్. 46

చ. కుటిలత రాహు వేచ్చి తనగ్రోలఁ బాముగ నెక్క నుక్కునన్
జోటజోటగా సుధారసము జొబ్బిలుచున్న శశాంకు రీతి న
చ్చటుల వినీల కుంతల విశాల విలోచనపాళి నీర ము
త్కటముగ దూఁకఁగా వదనకంజము విన్నఁదనంబు చూపఁగన్. 47

క. "ఓతండ్రీ, యీవిధమున
సేతువు గజతలమునకును జేసెద వేలా
చేతమునఁ దలఁపుమా కవి
చేతోవిభుఁ గాక యన్యుఁ జేపట్టెదనో. 48

క. అది గాక బ్రాహ్మణోత్తముఁ
డాదవును దోషంబు నీకు. నుర్వీశుఁడవే;
యిది రాజ ధర్మ మగునే?
పదపడి ప్రోచుటయు మేలు ప్రజలు నుతింపన్. 49

ఆ. భవ్యుఁ డతనివలనఁ బాపమించుక లేదు;
నేన స్మరనిభుని మనీషివిభుని

పెండ్లైతి; నీకు బ్రియము గా దేని, న
న్నాజ్ఞ సేయవలయు నతని వలను. 50

క. ఈజగతిన్ గాంధర్వము
రాజకులజకున్ వరము; ధరాసురు బుధు నా
యోజన్ నేను వరించుట
రాజా, నీకులము నుద్ధరణసేఁత కదా. 51

తే. నిగ్రహానుగ్రహములకు నృపుఁడు దక్షుఁ;
డరయ నిందు నకార్యకార్యమావంత లేదు.
యెన్ని యుండిన బ్రాహ్మణు నేఁచరాదు;
'బ్రాహ్మణాన్ భర' యనియెడు పలుకు వినవె?" 52

వ. అని దీనాలాపంబుల నబ్బాలామణి విలపించుచు మఱియు మఱియుఁ బలికిన వైశ్వానరునియందు ఘృతంబుఁ జిలికిన చందంబున మండిపడి ప్రత్యుత్తరం బియ్యక విముఖుం డయినఁ, గంబుకంఠి యాస్థానంబు వెడలి పోవుచు నిట్లనియె. 53

సీ. 'తండ్రి నాపయి నింత దయ నింప డాయెఁగా
డాయెఁగాఁ బోయి దండంబు లిడినఁ ;
దల్లి యడ్డపడి తాఁ దప్పింప దాయెఁగా
దాయెఁగాఁ దలఁచెనో తనయ యనక ;
నాళీజనశ్రేణి కాత్మ నిం పాయెఁగా
పాయెఁగా రాని యీపాటు విన్నఁ ;
గలవారి కెల్లఁ గన్నులు చల్ల నాయెఁగా
నాయగాధంపుఁ జందంబుఁ గన్నఁ ;

తే. కటకటా యెవ్వ రైన నాకష్ట ముడిపి
ప్రోవలే రైరి; లే రైరి భూతదయులు ;
నేమి సేయుదు? నే మందు? నెందుఁ జొత్తు?'
ననుచు వగచుచుఁ గవిమార్గ మనుసరించి. 54

—* రాజపుత్త్రి కవినిఁగూర్చి విలపించుట *—

ఉ. హా కవిరాజరాజమణి, హా నవమోహన, హా మనోహరా,
హా కరుణాగుణాభ్యుదయ, హా రమణీ నవ పంచసాయకా,
హా కమనీయగాత్ర, యొకరైన నినుం గృపఁ బ్రోవరైరయో!
యోకడ నీవు దైవమున కేమి విరోధము సేసితో కదా. 55

సీ. వికట దుస్సహ మహా విషము కంఠంబున
దాక్షాయణీశుండు దాల్పలేదె?
సతత దుర్వార విస్తృత శిఖా బడబాగ్ని
జలధి యంతరమున నిలుపలేదె?
సకల చరాచర జంతుసంతానంబు
నేర్పడఁ బుడమి వహింపలేదె?
పృథివీతలం బెల్లఁ బృష్ఠభాగమునందు
మొగిఁ గూర్మనాథుండు మోవలేదె?

తే. యంతకన్నను గవివరునందుఁ గలదె
దోషభర? మెవ్వరైనను దోడరి ప్రోవ
రయ్యొ, భూపతి వినఁ జెప్పరయ్యొ, కరుణ
నింపరయ్యొ, నావెత నివారింపరయ్యొ. 56

తే. ఇంచుకేనియు దోసఁగు లేదితనియందు,
చేన గోదిన విప్రుండు గాని యితర
వంశజుఁడు గాఁడు; ధర్మంబు వరుసఁ జూడఁ;
నెయ్యు లెవరైన నీకవిఁ బ్రోవరయ్యొ. 57

వ. అని మఱియును. 58

ఉ. ఈ కవిరాజు ప్రోవ తన కయ్యెడఁ గాక యటంచు నా సతీ
లోకశిరోవిభూషణము లోలత దిక్కులు సూచి తెంపునై
రాకలుఁబోకలుం గలుగు రాజుల నార్యులఁ గాంచి యెంతయు
శోకముతో విలజ్జ యయి సోలుచు వ్రాలుచుఁ బల్కె నీక్రియన్. 59

సీ. కుఱ్ఱడుగా మది నెంచి పండితహంస
నాదరింపరె చతురాస్యులార,

కారుణ్యమున గతి గల్పించి ద్విజరాజు
భరియింపరే చక్రభరణులార,
నిరుపమ సత్కళానిధిని మన్నింపరే
తల యొడ్డి రాజవతంసులార,
విదిత నిరాధారు విబుధేంద్రు నిలుపరే
యిర వొంద భూరిధరేంద్రులార,
తే. సుకవితాపంబు దీర్పరే శూరులార,
బ్రహ్మకులజునిఁ దేరె గోపాలురార,
ధర్మగతిఁ బూని రాజకందర్పులార
నామనోహరుఁ గూర్పరే నాయ మెఱిఁగి.' 60

వ. అని బిల్హణు నుద్దేశించి ముద్దియ యి ట్లనియె. 61

మ. 'అరవిందంబులరీతిఁ జెన్నలరు నీహస్తంబు లె ట్లోర్చె ము
ప్పురిగాఁ బెన్చిన కాలపాశములకున్? ముగ్ధాంగనా గాన భ
వ్యరసోత్కర్షభృతంబు నీ శ్రుతియుగం బత్యుద్ధతోర్వీప కిం
కర వాదార్భటి కెట్లు తాళె మదనాకారా మనోనాయకా?' 62

వ. అని యిట్లు పొగిలి పొగిలి. 63

తే. తరుణి నగరంబు గడచి పోఁ దలచియున్న,
నున్నతాకారు లచ్చట నున్నవారు
వారణము సేయ, నంతఁ దద్ద్వారసీమ
సీమవా రెల్లఁ జూడ వీక్షించుచుండె. 64

—* పౌరజనవాక్యములు *—

వ. ఆసమయంబున నగరజనంబులు తమలోనఁ దా మిట్లనిరి.— 65

సీ. అవనీశ్వరుఁడు నన్ని యంతఃపురంబులోఁ
జేర్చినఁ నెంత దాఁ జేసె నితఁడు!
కన్య నీవిధమునఁ గలుపాత్ముఁ డీతఁడు
గలసె దానికి నింక గతియు నేమొ?

యెంతపనికిఁ జొచ్చె నీభూసురాధముఁ
  డేర్పడ నిది బైట నెట్లు పడియె?
దాఁగునా యిట్టిది? ధరణీశుఁ డెంతయుఁ
  జేసె నిర్ధారకు వీక్షింపకుండ.
తే. విప్రుఁ డెక్కడ మేదినీ విభునిపుత్త్రిఁ
  గవయు టెక్కడ? నిది చూడఁ గడిఁదివింత;
చెలఁగి చేసినవారికిఁ జేసినంత
  యనుభవింపక తీఱునా యవనిలోన. 66

క. ఏకాంతంబున నుండిన
లోకములోఁ దలఁప నెట్టిలోకుల కైనన్
డీకొనును బుద్ధి సతిపైఁ
బ్రాకటముగఁ వారి ననఁగఁ బనియేమి యిఁకన్? 67

ఉ. చిక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడు కవీంద్రమౌళి యా
చక్కెరబొమ్మ యట్టిదె; విచారము లేటికిఁ? జూచునంతలోఁ
జక్కెరవింటిజోదు రభసమ్మునఁ దూపులు వింటఁ గూర్చి బల్
చిక్కులఁ బెట్టకుండునె వచింపఁగ నొంటిగ నుండువేళలన్? 68

చ. కటకట! యెట్లు భూసురునిఁ గాసి యొనర్పఁ దలంచుఁ బంచె న
క్కుటిలుఁడు భూమిపాలుఁ! డిది కూడదు చెప్పఁగ నేరికైన; నిం
తటికిని దైవయోగమ కదా తలపోయఁగ! వానిభాగ్య మి
ప్పటి కిటు లుండె; నిట్టిపని ప్రాజ్ఞుని కెచ్చట నైనఁ బాడియే. 69

చ. ఇల నిఁక వీనిఁ బట్టి వధియించిన నీసతి మేనఁ బ్రాణముల్
నిలుపదు; దానికిన్ జనని నిల్వదు; భూవరుఁ డంతట న్మదిం
దలఁపఁగ నేమి యౌను? యట ధారుణి యేవిధ మౌను? యింతకుం
జల మఱి భూవిభుండు కవి సన్మతిఁ బ్రోచిన నన్ని చక్కనౌ.— 70

వ. అని వేఱువేఱ గుంపులు గట్టి పలుకుచున్న నొక కొంద ఱిట్లనిరి. 71

క. చోరుఁ డని నామ మీకవి;
  కారయఁగా నేఁటికిని యథార్థం బయ్యెన్

జారుఁ డనియు; రెండుం దగె;
శూరులు సైఁపుదురె జార చోరత్వంబుల్. 72

వ. మఱికొంద ఱిట్లు పల్కిరి. 73

క. ఏమి దోసంగే క్షత్త్రియ
కామిని గాంధర్వమున మగనిఁ గైకొనినన్ ?
ఈమహి రాజర్షిసుతల్
భూమిసురులఁ బెండ్లి యాట పోణిమియ కదా.— 74

—* రాజపుత్త్రి కవికి మొఱయిడుట *—

వ. అనుటయు నకాంతాలలామం బక్కవివరుని జూచి యి ట్లనియె.

ఉ. 'హా కవిరాజచంద్ర మదనాంచితవిగ్రహ నన్ను నిప్డు డ
స్తోక వియోగ వారినిధిఁ ద్రోచి చనం దగ వౌనె నీకు ? న
య్యో ! కరుణాంబురాశి వని యుల్లమునం దగ నమ్మియుంటి; నీ
వేకత నెట్టు లేఁగెదు రహీం! నను వీడ్కొని యేఁగఁ జెల్లునే?' 76

వ. అని విలపించుచుండ, మార్గంబునం బోవుచుండి విని బిల్హణుండు దో
దూయమానమానసుం డై తిరిగిచూచి యి ట్లనియె.— 77

—* బిల్హణుండు బదులు పలుకుట *—

ఉ. 'హా కమలాయతాక్షి, చెలి, హా సరసీరుహకుట్మలస్తనీ,
హా కమనీయగాత్రి, సతి, హా నవమోహిని, హా వధూమణీ,
హా కనకాంగి, నేను విడనాడితి నంచుఁ దలంచె దీవు ? నీ
లోకమునందు జీవునకు లోలత గాక నిజేచ్ఛ యున్న దే. 78

ఉ. ఓ రమణీమణీ, వికసితోత్పల పత్త్రవిశాలనేత్ర, న
న్నారక యేల చూచెదవు ? ద్వారనివాసిని, గోల, దేవతా
వార వధూటికా నయన వాగురికా వలయంబునందు దు
ర్వారతఁ జిక్కి తా మగిడి వచ్చునె బిల్హణుఁ డెన్ని భంగులన్ ?' 79

వ. అని పలుకు భూసురవరునిఁ దలవరు లురుగతిఁ బద మని శ్మశానవా
టికిఁ దోడుకొని పోయి యొకవటవృక్షంబుక్రింద నిల్పిన బిల్హణుఁడు

నలుదెసలం జూచి తెల్లడిల్లనియుల్లంబుతో మందస్మితవదనారవిందుం
డై వీరసేనున కిట్లనియె. — 80

— * బిల్హణునిధీరత * —

ఓ తలవరి, తడ వేటికి?
నాతత నిశి తాసిఁ గొని ధరాధీశుని యా
జ్ఞాతంత్రమునను బిల్హణు
వే తెగ వ్రేయుము శిరంబు విశ్వము మెచ్చన్.' 81

అనిన విని వీరసేనుం డిట్లనియె. 82

కవిరాజవర్య, నీ విపు
డవిరళగతి నింపు లైన నాత్మభయంబుం
దవులక ధరస్మితాస్యుండ
వపుటకుఁ గత మెద్ది సెప్పు మమలవిచారా.' 83

అనిన బిల్హణుం డిట్లనియె. 84

శ్రీనుతమతిఁ జెప్పెద, వ్వీరా మహీనగుణాకర వీరసేన; యా
క్షితిరమణాత్మజాత సరసీరుహలోచన మంత్రదేవతా
కృతి యయి వేడ్క నా హృదయ గేహమునందు వసించి జోడుగా,
సతతము నాయుకున్న దిఁ; విచారము లేటికి? దైన్య మేటికిన్?' 85

అని మఱియు నిట్లనియె — 86

కలికి పద్మరాగమణి హాస వికస్వర చారు రుచిన్ గుణాకరన్
జలరుహలోచనన్ జలజసౌరభఁ బూర్ణ సుధాకరాననన్
సలలిత తుంగ పీన కఠిన స్తన మధ్యగ హార భాసురం
బిలసను నాసికన్ మదిని దేవతఁగా స్మరియింతు నాత్మయున్.' 87

— * తలవరి కవిని ఖండింపక యుండుట * —

అని తదేకాయత్తచిత్తుం డైన కవివరుని జూచి ఖండింపఁ జేతులు రాక హృత బహుజన ప్రాణం బగు కృపాణంబు నేలం బడవైచి వీరసేనుండు కృపాధీనుం డై నిలువఁబడియున్నఁ; దదనంతరంబ యవ్విప్రుండు రాజపుత్త్రిని హృదయంబున నుపలక్షించి యిట్లనియె. — 88

—* కవి కామినిని బలుదెఱంగుల స్మరించుట *—

చ. పరమ సువర్ణ చంపక విభాసుర గౌరి, సురోమరాజి, ని
ద్దుర గొని మేలుకొన్న సతిఁ, దోయరుహాంబక, విహ్వలాంగిఁ, దా
మరస దళాయ తేక్షణఁ, బ్రమాద వశంబునఁ బోవు విద్య నై
ఖరి మదిలోన నెప్పటికిఁ గాంతు దలిర్పఁగఁ జింతసేసెదన్. 89

మ. విలస త్పంకజ మధ్య గౌర రుచి యై పెంపొంది, గోరోచనా
తిల కోదంచిత పాటల ద్యుతి కన ద్దివ్య ల్లలాటంబు నై,
బలి నెక్కొంతమదంబుచే నలస లీలా ఘూర్ణ దృక్పాత మై,
చెలువౌ నాసతి మోమునన్ నిలుచు నా చిత్తంబు యుక్తంబుగాన్.

ఉ. పున్నమ నాఁటి చందురునిఁ బోలు మొగంబును, మొల్కచన్నులున్,
సన్నపుటారు, లే వయసు చాయలు దేఱిన మేని సొంపు, నా
కన్నియరూపు నే మగుడఁ గాంచితినేని మనోజ సాయకా
గ్ని న్నెఱకాఁక నూఁకొనిన నెమ్మెయి నెమ్మదిఁ జల్లఁజేయుదున్. 91

ఉ. ఏవిధిఁ గాంతు నారమణి ? నే నొకరాతిరి తుమ్మినన్, 'జిరం
జీవ' యటన్న తచ్ఛుభవిశేష వచోవిభవంబు మాని కో
పావహచిత్త యై పలుక కందపుఁగమ్మ ఘటించెఁ గర్ణమం;
దావిధి నామది న్మెదలి యాడుచు నున్నదిగా ఘనంబుగాన్. 92

ఉ. ఉన్నత చారు పీవర పయోధర భారముచేత ఖిన్న యై
చెన్నగు నూత్న యౌవనముచేఁ దనరారు సుధాకరాననన్
గ్రన్ననఁ గౌఁగిలించి వదనంబు ముదంబున ముద్దు వెట్టుదున్
వన్నియ మీఱ మత్త మధుపంబు సరోరుహ మాను కైవడిన్. 93

ఉ. మానిని, విస్ఫుర త్కమల మంజులపత్త్రి విశాలలోచనం,
బీన కఠోర తుంగ కుచ, భృంగ గరుద్రుచి నీల వక్ర స
మ్మానిత కోమ లాలక, సమాన వరాకృతిఁ, గామదేవతన్,
దాని గురూపదేశము విధంబున ధ్యానము సేయుదు న్మదిన్. 94

మ. నెరివాల్ చూపులు, మొల్ల క్రొవ్విరుల కాంతిం జెందు పల్జాడ,సుం
దర మై తేనెలు చిల్కు మోవి, గల యా తన్వంగి వక్త్రాబ్జ మీ

ధరణిం సాధు పరోపకారమును డెందంబందు నెట్లో యటే
యరయన్ విస్మృతిఁ జెంద నెప్పటికి నత్యంతానుభావ్యుండ నై. 95

ఉ. దీటునెలంగఁ బంచశర దివ్య ధను ర్గత మత్త భృంగరా
టోత్కటి గరుత్ప్రభా రుచిర కోమల కర్బురి తాలకంబులం,
నీటుగు దంతపత్త్రముల, నీల సరోరుహ భూషణంబులన్,
బాటిలు దానిమోము చెలువంబు దలంచెద మాటిమాటికిన్. 96

శా. తెల్లంబై చిఱునవ్వు వెన్నెలలచేఁ దెల్పొప్పులేఁ జెక్కులున్,
మొల్లంబై తగుచంచరీకముల గోముం జెందు కన్దమ్ములుం,
బ్రోల్లీలాంక శరత్సుధాంశు రుచియుం, బొల్పొందు నమ్మోము నా
యుల్లంబుం జివురింప నిప్పటికి నే నుప్పొంగి వీక్షించెదన్. 97

చ. దరము హసించు కంధర ముదారత వంచి, కరాంబుజాతమున్
వరకటి సంఘటించి, జడ వామభుజంబున గబ్బిగుబ్బ చ
న్నొరయ వహించి, నిల్వఁబడి యూరక నన్ను ననేకరీతులన్
వరమతిఁ జూచు నత్తరుణి వర్ణన సేసెద నే ముదంబునన్. 98

ఉ. నే నపరాధినై యడరి నేర్పునఁ దత్పదపంకజంబులం
బూనికతోడుతం బడినఁ, బోవఁగఁ ద్రోచి, చరించుచున్న, న
ద్దాని చెఱంగు వట్టిన, నుదాత్తత నిగ్గక, కోప మయ్యెడన్
మానక యున్నదాని వరమానిని నాత్మఁ దలంతు నెంతయున్. 99

చ. సరిఁగొని నేల నేలు సువిశాలనితంబము లొప్పుదాని మే
ల్సరసులలోఁతుఁ గాంచి బలుసమ్మతముం గనునాభిదాని మం
థరగతి గల్గుదానిని మృణాళ సమాన విలాస బాహువుల్
బరఁగిన దాని నెన్నెదను భావమునం దనుమధ్య నెప్పుడున్. 100

ఉ. నాయెడ నొక్కమాటను మనంబున భావన చేసి, మాటికిన్,
డాయక, యంతరంగమును దా నరికట్టుచుఁ, గోపభావయై,
యాయతబాష్పకంఠ యయి, యప్పటియూర్పుల మోవి గ్రాఁగఁగాఁ,
జేయఁ దొడంగె రోదనము; చింతన సేయుదు దాని నెంతయున్. 101

శా. ఏకాంతంబున నొక్కనాఁడు గృహమం దెవ్వారు లేకుండఁగా,
నాకంజేక్షణ దర్పణంబుఁ గొని వీక్షాసక్తి నుండంగ, నే

జోక నెన్కఁ వసింప, మత్ప్రితిమయుం జూపట్ట, వే సిగ్గుతో
నాకంపించి భ్రమించి మించె మదనోద్యన్మానసాంభోజ యై. 102

చ. మఱియు సుగంధయుక్తమయి మంజులమై తగు మోముఁదమ్మిపైఁ
దెఱలెడు గంధలుబ్ధ మగు తేఁటిగమిం గనుదోయి మాటికిం
దెఱచుచు మూయుచు న్నగము ద్రిప్పుచుఁ గేలిసరోరుహంబుచేఁ
దఱుముచు నొప్పునప్పొలఁతి ధ్యానము సేసెద నిట్టివేళలన్. 103

చ. అటు నిటు ముందు వెన్కఁ బహిరంతర సీమల నన్నిదిక్కులన్
స్ఫుటతర కాంచనాంబురుహ శోభిత మంజుల సుందరాస్య యై
తటుకున వాలుఁజూపులను దానను జూచుచు సంచరించు న
చ్చటుల విలోచన న్మదిని సన్నుతి సేసెద నే బ్రియంబునన్. 104

శా. ఆకర్ణాంతము లై మదాలసము లై యబ్జోపమానంబు లై
శ్రీకల్యాణము లై రమావరసుతోద్రేకంబు లై యొందవా
స్తోకాంశు ప్రతిమంబు లై మధుకరీ శోభాయమానంబు లై
యాకంజాక్షి విలాసనేత్రములు నా స్వాంతంబునం దొప్పెడున్. 105

చ. సమయ మెఱింగి నేఁ దలుపు చాటున నుండఁగఁ గేలుఁదమ్మి నెలా
హమున మొగంబునం దిడి మదాగమనంబుఁ దలంచి చూచుచుం
గ్రమమున మత్కృతాంక పద కాంశములన్ మృదుగీతిఁ బాడుచున్
రమణ మనోవికాస యయి రాజిలుదాని మదిన్ భజించెదన్. 106

చ. కలువలఁ గేరుకన్నులను గాటుక రేఖలు దీర్చి, చెక్కులం
దలరఁగ జందనం బలఁది, యాపయిఁ గస్తురి కొంత పూసి, ఫాల
తిలకము దిద్ది, ముత్యముల దీటుగఁ బాపట బొట్టువెట్టు న
య్యాలికులవేణి ముద్దుమొగ మబ్జనిగాఁ దలఁపోసెద న్మదిన్. 107

చ. స్మరజనకంబులై యమృతసారము లై శ్రుతిరంజనంబు లై
యరయ మృదూత్తరంబులయి యందము లై మదికిం బ్రియంబు లై
కెరలుచు నోష్ఠపృష్ఠ పరికీర్ణ శుచిస్మిత సంయుతంబు లై
పరఁగు నెలంతవాక్యములు పట్టుగ శోభిలు నామనంబునన్. 108

చ. తనరఁగ నామదిం దరళ తార నిమీలిత లోచనాబ్జ మై
యనుపమ లిప్త చందన రసాహిత పాండుర గండభాగ మై

ఘన మృగనాభికా కుటిల కల్పిత పత్త్రిల తాభిరామ మై
యను వగు సుందరీమణి ముఖాబ్జము నిల్పెద వేశ్య మీఱంగన్. 109
చ. మఱియును గర్ణపాళిని సమంచిత కాంచన కుండలంబులున్
మెఱయఁగ, గబ్బిగుబ్బచనుమిట్టల ముత్యపుఁబేర్లు రంజిలన్,
బిఱుఁదులఁ గాంచి యొప్ప, మురిపెంబున నందెలు మ్రోయ, వచ్చు నా
మెఱుఁగుమిటారి నెన్నడఁ జమీమవి నిప్పటికిన్ హితంబుగాన్.
చ. కురులు భుజాగ్రభాగమునఁ గూడి నటింప, గళంబు లీల మై 110
నొరగఁగఁ బెట్టి, తైక బిగి, నెయ్యనఁ గాంతులు జీరువాఱఁగాఁ,
బెరుఁగు మిటారి గుబ్బ లలవిం గనుపట్టఁగ, నన్నుఁ జూచు న
గ్గరిత యమర్శాళదృష్టు లెదఁ గాంక్ష దలిర్పఁగఁ దేజరిల్లెడున్. 111
చ. అలరఁగఁ గోపలారుణ కరాంగుళు లౌదల పై ఘటించుచో
వలయమముగా భుజాలతలు వంచి దృఢాంగ వివర్తనంబునన్
వెలయుచు నుండఁగా సపరివేష సుధాకర కాంతి నొప్పు న
ప్పొలఁతుక మోము నామదిని బూని భజించెద వేశ్య మీఱఁగన్.
మ. అలరుం బానుపు డాసి, వచ్చుటకు నే నాలస్యముం జేయఁగా,
వల పెచ్చం, దలపోసి, మారవికృతిన్ ద్వారంబున న్నిల్చి, సం
చలనం బందుచు, నెచ్చెలిం గదిసి, కాంతుఁ డేఁడె నెగ్గెత్తి కో
కిలవాగ్వైఖరి రోదనంబు గను నా కేళీసఖిం గాంచెదన్. 113
ఉ. ద్వారము నవ్వసించి కడు దైన్యమునన్నను జూచి చూచి త
ద్ద్వారతలంబునం బడి శుగార్తిని దస్సియు నించుకంత ని
ద్రారతిఁ జెంది లేచి మది తల్లడిలంగ లసత్కపోల యై
యూరయుచున్న నెచ్చెలిని నాత్మభజించెద మాటిమాటికిన్. 114
మ. నలి నూర్పుల్ నిగుడంగ, నేత్రయుగళి న్బాష్పాంబువు ల్రాల, సం
చలంత జూచుచు, నావిధం బడుగుచున్, స్వాంతంబు నానావిధం
బులఁ బోఁగా, మదనుండు పైకొనఁగ, మోముం వాంచి చింతించు న
బ్బాలభిన్నాలకలాకచన్ మదిని నే భావింతు నశ్రాంతమున్. 115
చ. మఱి యొకనాఁటి ప్రొద్దునను మానకఁ బంచటరంగుపైని దా
సిఖుమముగ నెచ్చెలిం గదిసి యేవా ప్రియోక్తులు పల్కుచుండ, నేఁ

బఱపున వచ్చి వెన్క నిలువం బడినంతనె, చూచి సిగ్గుతోఁ
జఱునగ వొప్పఁ బోవు చెలిఁ జిత్తమునం దలపోసి చూచెదన్. 116

మ. అపరాధం బొనరించి తీవనుచు నన్నత్యంతకోపంబుతోఁ [బో
నుపలాలింపక, మోమొసంగక, యొహో హో చాలుఁ బొమ్మంచుఁ,
కపటున్నేను బ్రియోక్తి నాముకొన, నందాసక్తి లేనట్టిమా
ట పచారించినబోటి నా హృదయనాటంబాదుఁ గీలించెదన్. 117

చ. పడుకొని యంతలోనఁ బరిభావిత యై వడి లేచి నిద్రచేఁ
దొడిఁబడ నావులించి మెయిపొట్రు విదిర్చి విజృంభణక్రియం
బొడమిన మోమువాసనకుఁ బూని భ్రమించుచునున్న తేంట్లసం
దడికిఁ జలించునట్టి కనుఁదమ్ములు గల్గినదాని నెన్నెదన్. 118

చ. మనసిజపూజ సేయ నిజమానిను లందఱు గూడి కేళికా
వనమున కేఁగుచోఁ దనదుపార్శ్వమునన్ వసియుంపఁ జూచు న
న్ననసినశంకతోడ జను లే మనుకొందురొ యంచు భీత యై
క్షణ మటు లుండు మంచుఁ గనుసన్నలు సేయు వధూటి నెన్నెదన్.

మ. కలకంఠోపమ కంఠి, నాస్య జిత రాకాచంద్రబింబ, న్మయూ
రలస ద్బర్హ సమాన వేణి, సుగుణవ్రాతాత్మ, నేత్రప్రభా
విలస న్మత్తచకోర, యాన విజిత శ్వేతచ్ఛదం, గాంచ నో
జ్జ్వల కుంభ స్తనిఁ గామినీమణిని నే భావింతు నెల్లప్పుడున్. 120

చ. వరుస వివర్తితంబు లయి వ్రాలు నపాంగ విలోకనంబులన్
మరు దళ నోపమాన మృదు మంథర మంజుల భాషణంబులన్
దర మధుర స్మితంబులను దాళిమియానములన్ విలాసితన్
సిరు లెసఁగంగ నొప్పు చెలిచేష్టలు నామది సంస్మరించెదన్. 121

చ. విలసిత మన్మథన్ విరహవిహ్వల లాలసగాత్రి సుందరిన్,
లలిత కురంగనేత్రను విలాసరసాంచిత చారుకాంచ నో
జ్జ్వల మహనీయ చేల యుత, శ్యామ, విరాజిత హంసయాన, నే
నలవడ సంస్మరించెద ననారతమున్ మదిలోన వేడుకన్. 122

చ. మలయగిరి ప్రభూత పవమానములం గని తీవ లాడఁగా
సలలిత రత్నవేదిపయిఁ జక్కఁగఁ దా వసియించి గీతముల్

దలకొని వీణ సుస్వరయుతంబుగఁ బాడుచు నాళిపాళికిన్
లలి శ్రవణోత్సవం బొసఁగు లక్షణగాత్రిని నే భజించెదన్. 123

—* వీరసేనుండు కవి రచించుపద్యంబులను రాజునకుఁ బంపుట. *—

వ. అని యిట్లు కవివరుండు మదనోన్మాదంబున యామినీపూర్ణతిలకాయత్తచిత్తుం డై తద్వర్ణనావిశేషంబులుగా రచించిన పద్యంబులు లిఖింపం జేసిన వీరసేనుని యనుమతంబునఁ దద్భృత్యులు భూపాలుని కప్పు డుప్పుటిం గర్పించినం జూచి చూచి యంత కంతకు నాతఁడు గోపాటోపంబునఁ గసరివై చుచున్న వారును విసికి విసికి మరలివచ్చి తద్వృత్తాంతం బంతయుఁ గవివరుండు విన వీరసేనున కిట్లనిరి. 124

చ. 'హిమరుచి సత్కళా విభవుఁ డీకవిరాజు రచించునట్టి పద్యములు గ్రహించి భూవిభున కర్పణసేసినఁ జూచి కోపభావమున మరుక్కులం బలికి వారక పొమ్మనుఁ గాని మంచిమాటమరఁగఁ బల్కఁ డాతఁడు; తదాగ్రహవృత్తి వచింపశక్యమే!' 125

చ. అనవుడు వీరసేనుఁడు దదాననముం గని, యో కవీంద్ర, యోయనఘుఁడ; యిందిరావరసుతాభుఁడ వౌసను సత్కృపామతిన్
మనమున హింససేయుమది మానితిఁ, బూనితి నే భరింపఁగాఁ;
బనివడి వ్రాయు పద్యములు పార్థివుఁ డొప్పఁ డి దేమి సేయుదున్?126

వ. అనవుడు భూసురుండు హృదయాబ్జమునం గడు నవ్వి, 'యోరి, నిన్ను నయము మెచ్చితిన్; విను, క్షమాపతిమానసముం గరంగునే? పనివడి యేల పంపితివి పాల్పడి? నా కయి బ్రహ్మదేవుఁ డిట్లనఘము వ్రాసియుండ వెతలం బడఁ గారణ మేమి చూడఁగన్ ?

ఉ. ఓరి, తలారి, వీరి మఱి యూరక త్రిప్పకు; మేమి త్రిప్పఁగా సారము? ఖడ్గముం గొని విచారము సేయక త్రుంపు;' మన్నఁ దద్ధీరత గాంచి వాఁడు 'క్షితిదేవకులోత్తమ, యేతదర్థ మై యూరయుఁ జాల నెంతపని కైన భరింపుదు నిన్ను లెస్సఁగన్. 128

క. ఏ మేమి వ్రాసితివో ? యా
భూమీపతి మానసంబు పొరలక పోయెన్;

సామీ, యీ మాత్రైనను
సామోదత మంచిపద్య మానతి యిమ్మా.' 129
వ. అనిన విని సృష్టికర్త యైనస్రష్ట నుద్దేశించి. 130
సీ. తన పృథ్వి యాఘనాఘనవేణి చరియించు
క్షితిభాగమున నుండఁ జేయవయ్య,
తన రసం బాసుధాధర క్రీడ లాడెడు
శృంగారసరసిలోఁ జేర్పవయ్య,
తన తేజ మాత్తకనకాంగి దర్శించు
దర్పణాంతరమునఁ దార్పవయ్య,
తనవాయు వాసుగంధశ్వాస విసరించు
కొను వ్యజనంబునఁ గూర్పవయ్య,
తే. తన నభం బారమణియింట నునుపవయ్య,
యీశరీరంబు పంచత్వ మొనసినపుడు
స్వాంశములతోడ భూతంబు లైదు నైదు
గూర్పవయ్య విధాత నా కోర్కి దీఱ.' 131
వ. అని యిట్లు కమలభవుని వేఁడి త్రికరణపూర్వకంబుగ నమస్కరించి
నిలువంబడి యున్న వీరసేనుఁడు తత్పద్యంబు గ్రహించుకొని రాజ
సమీపంబునకు వచ్చి తత్పత్త్రిక సమర్పించిన. 132
క. 'ఇది యేమి? మాటిమాటికి
హృదయంబున లేదె భీతి యొంతయు?' నన వాఁ
డదరక 'సామీ, భూవర,
యిది చూడుఁడ, యొక్క వింత యేమో తలఁపన్.' 133
వ. అనిన లిఖితంబు గైకొని పద్యంబుఁ జదువుకొని యయ్యర్థంబనేకా
ర్థంబులుగాఁ దోఁచినఁ గొంతతడ వాలోచించి యిట్లనియె. 134
క. 'ఓరి దురాత్మక, నీవిటు
సారెకు రావలవ; దింకఁ జనుదెంచితివా,
వారక నిను దండించెద;
నూరక యాపని ఘటింపు; మొప్పదు మాకున్.' 135

ఆ. అన వి రాజుఁ డగుచు నావీర సేనుండు
వచ్చి పలికె విప్రవరునితోడ
'నేమి వ్రాసినాఁడ? వెఱుఁగ నే, నింతైన
మనసు గరఁగదయ్యె మనుజపతికి.' 136

మ. అని పల్కంగ, దల యూఁచియూఁచి, మది నాహా యంచు, వే సాహసం
బునఁ జాతుర్య మెలర్పఁగాఁ దనగతిన్ భూమీశు నుచ్ఛ్రాయము౦
గని, రెండొక్కటి యైన మంచిది యగుం గాకంచు నిశ్శంకుఁడై,
చన నూహించె శరప్రయోగ మతఁ డేచం బద్య ముద్యద్గతిన్.

—* విరాజు కోపశాంతికరంబైన యొకపద్యము వ్రాసి పంపుట. *—

చ. 'రవిజుఁడు భా గుణింప విధురంబుగ భట్టి నశించె, భారవి
ప్రవరుఁ డడంగె దీర్ఘమునఁ, బ్రాణ మిడెన్ గుడియియ్య భిక్షు, డీ
నవనికిఁ దప్పె భీముఁడు, జడంతగతి న్మఱి కొమ్ము వెట్టని
కావముగ నే భుకుండుఁడను, గొమ్మున దీర్ఘము వెట్టకుండఁ డీ,
భువి నతఁ డెన్న నిర్దయుఁడు, భూపతి పీవుఁ దలంప భూవరా.' 138

వ. అని యీపద్యంబు లిఖియించి వీరసేనున కిట్లనియె. 139

క. 'ఓపుణ్యాత్మక, వినుమా,
యీ పద్యము చే గ్రహించి యొంతయుఁ జని నీ
వేపున నొసఁగిన, వే యా
భూపతి నను బిల్వ నంపుఁ బొమ్ము రయమునన్.' 140

వ. అని చెప్పిన నప్పద్యంబు గ్రహించుకొని పోయి రాజుముందఱం
బెట్టినిన నప్పత్త్రిక దండధరాసిపత్త్రికవిధంబున మదికిం దోఁపం జూచి
తదర్థంబు గ్రహించి మహీవల్లభుండు పవనోత్కంపిత కదళికా మహీ
రుహాంబుచందంబునఁ గంపిత సర్వావయవుండై యొంతయుం బొద్దు
చింతించి తదుభయదృఢతరస్నేహసారంబులును దత్కవితామహ
త్త్వంబును విచారించి వానితో ని ట్లనియె. 141

—* రాజు కవిరాజుం బిలువఁ బంపి పుత్త్రి నూఱడించుట *—

క. 'ఓవీరసేన, యిచటికి
వే వేగను దోడితెమ్ము బిల్హణు.' ననినన్,

భావము రంజిల వాఁడు ధ
రావిభునకు మ్రొక్కి వచ్చి రాసుత కనియెన్.

క. 'ఓ తల్లి, నీమనోహరు
నాతత సదయాంతరంగుఁడై వసుధేశుం
డూతఁగొని దోడితెమ్మనె
నీతాపము మాను మింక నీరజనయనా.'

వ. అనిన గ్రీష్మసమయోష్మ దందహ్యమాన మానసయైన మయు
ఘనాఘన గర్జానినాదంబు విని నచందంబున సుందరీమణి తద్వచ
విని కుతూహలాయత్తచిత్తయై కంఠహారం బొసఁగిన గ్రహీ
కొని బిల్హణున కిట్లనియె.

ఉ. 'ఓకవిరాజశేఖర, మహోన్నతి నీవు రచించుపద్యముం
దేఁకువతోడ నానరపతిం గని యిచ్చినఁ జూచి యెంతయుం
గైకొని దానియర్థమును గాంచుఁ దలిర్ప గ్రహించి యప్పుడ
స్తోకజవంబుమీఱ నినుఁ దోడ్కొనిరమ్మనె నయ్యలియ్యెడన్.

వ. అని యత్యాదరంబున శుభలక్షణ ప్రశస్తం బగు సతని హ
బట్టుకొని వచ్చునెడ.

తే. రాజరాజగుమదనాభిరామనృపతి
తనకుమారిని దలఁచి యాస్థాన మెడలి
వచ్చి తద్ద్వారమం దున్న వజనపత్త్రి
నేత్ర దగ్గఱఁ జేరి కన్నీరు దుడిచి,

తే. శిరము మూర్కొని చికురముల్ సిక్కువాపి
చక్కఁగా నిడి గద్గద స్వరముతోడ
ననియె దయ మీఱ భూపాలుఁ డాత్మజాత
'కమ్మ సంతాపమును మాను మమ్మ' యనుచు.

క. 'ఓ కూర్మితనయ కవివరు
నీకోరిక మీఱఁ గూర్తు నిశ్చలమతివై
నాకడకును రావమ్మా
యీకడ నా చేయుపని గ్రహింపుము మదిలోన్.'

—* రాజు కవివరు సమ్మానించుట *—

వ. అని యుపలాలించి యంతఃపురంబున కనిచి, బిల్హణునకు నెదురు సని నమస్కారణపూర్వకంబుగఁ గౌఁగిలించి చతురంతయానంబు నధిష్ఠింపం జేసి సభామంటపంబునకుం దోడ్కొని వచ్చి యుచితాసనంబునం గూర్చుండ నియమించి సభాసదులు విన నాతని కిట్లనియె. 150

ఉ.'ఓ చతురాననాన్వయ మహోదధి పూర్ణశశాంక, బిల్హణా
ఖ్యా, చతురాస్య, నీమహిమఁ గన్గొన నేరికి శక్య మీధరన్ ?
నీ చతురోక్తి వైఖరికి నీ దృఢవృత్తికి నీ కవిత్వధా
రాచలితైక నిష్ఠకు నహర్నిశమున్ మది నేను మెచ్చితిన్. 151

—* రాజు కవివరుం దనకూఁతుఁ బెండ్లి గమ్మనుట *—

చ. తడఁబడి యెవ్వఁడేనియుఁ గృతఘ్నునియం దొనరించు మేలు వై
వడిని మదీయకృత్రిమము భవ్యగుణాకర నీమనంబునం
దడవక సుందరీమణిశిరోవతంసము నాతనయన్ వరించి యే 152
ర్పడ నయ మొప్ప మత్పురికి భర్తవు గమ్మని పల్కి వేఁడియున్.

క.'రేపు సముస్తం బగుఁ గా;
క్షీప్రొద్దునఁ బడిలినాఁడ; పీహితమతి నీ
పీపట్ల నేఁదఁ దేఁటుము
భూపాల ను తైకచర్య భూసురవర్యా.' 153

వ. అని యొడంబఱిచి కవివరుని యథాస్థానంబున కనిచి వసంతామాత్యున కిట్లనియె. 154

క.'ఓ మంత్రివర్య, చూచితే
భూమీసురుచిత్తవృత్తిఁ బోలింపంగా
నే మందు ? నెంత దృఢ ? మా
భామామణిహృదయ మట్ల పరిశీలింపన్. 155

క. ఈవిధమున నిర్వురకున్
దైవాజ్ఞన్ ఘటన మయ్యెఁ; దప్పింపఁగా
నావశమె ? యగ్రజన్ముఁడు;
భావింపఁగఁ గూఁతు నిత్తు భవ్యవిచారా.' 156

వ. అనిన విని మంత్రివరుండును సభాసదులును నిది యవశ్యకర్తవ్యం బనిన, విని వారలం బనిచి యంతఃపురంబుఁ బ్రవేశించి పరిచారికాజ్జనంబులం బిలిపించి యిట్లనియె. 157

క. 'ఓకాంతలార, మత్సుత
కాకవివర్యునకు భోజనాదులు పూర్వం
బేకొలఁది విచారించితి
రాకొలఁదిం జేయుఁ' డనుచు ననిచి రయమునన్. 158

వ. తనదారమందారమాలిక కాచందం బంతయుం జెప్పి యాయమకానందం బాపాదించి భోజనాదికృత్యంబులు దీర్చి సుఖం బుండునంత.

—*ప్రాతఃకాలము*—

చ. తెలతెలవాఱెఁ దూర్పు, నలుదిక్కులవిచ్చెఁ దమంబు, పక్షులుం
గలకలపల్కెఁ, గోకములు గాంచె ముదంబు, లుడుప్రజంబు ఖ
స్థలమున నాడకాడకును జాఱెఁ, జెలంగి పదాయుధంబు లు
ద్గళగతి మ్రోసె, వీచె వలిగాడ్పులు భూజను లుల్లసిల్లఁగన్. 160

సీ. కోకాంగనాగణ శోక మారుతమిత్త్రి
ఘనతర జ్వాలలఁ గందినాఁడొ?
విరహానిస్సహా వధూ విపుల నిశ్వాస నోష్ణ
గంధవాహములచేఁ గమలినాఁడొ?
బాధిత పద్మినీ పటల శుష్కప్రాప్త
ఘోర పాపంబునఁ గుందినాఁడొ?
జన దూరితాప్రాప జార చోర వ్రాత
శాపంబులను గొంత సమసినాఁడొ?

తే. యనఁగ దోషాకరుండు కళానుభూతి
దొరఁగ వెన్నెలపులుఁగులుఁ దొడరి యితఁడు
రేపు నేవేళ కొదవునో మాప నేమి
యనుచు వడి సారమంత కొల్లాడ నరిగె. 161

మ. ముద మొప్పారఁగఁ బద్మినీమణులు మోము ల్విప్పఁ, జక్రంబు ల
భ్యుదయం బొంద, సదాళులున్ సదన విస్ఫూర్తిం బ్రవర్తిల్ల, నా

స్పదమై భాసిలు పుష్పదంత గజరాజం బెక్కి, యుద్యద్ద్విజాల్
మది రంజిల్లఁగ సన్నుతింపఁ, బొలసెన్ మందానిలుం డత్తఱిన్. 162

మ. మలయాహార్యతటంబు డిగ్గి, విలస న్మల్లీమతల్లీ లతా
వళులం జిక్కి, ప్రయాసిత న్వెడలి, దీవ్య చ్చారు కాసార ని
ర్మలతోయంబుల నీఁది, పంకరుహ సౌరభ్యంబుఁ గొల్లాడి ష
ట్పదుల నాదంబులతోఁ జరించె మరుదంకూరంబు లవ్వేళలన్. 163

క. తనతమ్ములవైభవమును
గానె నఁట యొకరాజు వానిఁ గొట్టెద ననుచున్
ఘనకోపుఁ డయ్యె ననఁగా
నినుఁ డతితేజం బెసంగ నేతెంచె నొగిన్. 164

మ. హరి చక్రంబు భరించి, యుద్భట నిశాటాటోపముల్ మాన్చి, యు
ద్ధుర లీలాప్తి బుధాంకవర్తి యయి, యెంతో పూర్వదేశంబు భా
సురమై యొప్పఁగ నిందు నందు నిలిపెన్ స్తోత్రార్హుఁడై యాచు శం
కర పద్మోద్భవులున్ భజింపఁ జెలఁగెం గల్యోదితాచారుఁడై. 165

ఉ. అంగుగఁ గాల మన్కరికి నావల నీవల వ్రేలు బంధు రా
భంగుర పాశలంబు లగు బంగరుపోఁతల ఘంటలో యనన్
సంగతి మీఱఁ బ్రాక్చరమ శైలములం గనుపట్టి రర్క సా
రంగధరుల్ నిజోర్ధ్వరుచు లందము నొందఁగ నట్టివేకువన్. 166

క. హిత విబుధ స్తుతి గోత్రా
హితకరుఁ డుదయించె గురు బుధేశ హితుం డై,
ధృతిఁ బూర్వదేశముం గొని
క్రతువులు గోతలమునందుఁ గడు నొప్పారన్. 167

సీ. అతుల ద్విజాలోకనావహుం డై త్రయీ
సుముఖుఁ డై నట్టి తేజోమయుండు
కమలా మనోహరాకారుఁ డై శర్వరీ
చరుల నొంచిన చక్రభరణశాలి
యఖిల లోక తమోపహరణ నైపుణవృత్తి

రాజిల్లు నట్టి సర్వజ్ఞవిభుఁడు
మిత్త్రుఁ డై భువన పవిత్రకుం డై తగ
ధర వెలింగించు సన్మార్గవర్తి
తే. యాదిమూర్తి యనంగఁ బద్మాప్తుఁ డనఁగ
నార్జితార్యుఁ డనంగ దివ్యైకవాక్స్త
వముల ద్విజరాజసంగతి వసుమతీధ్ర
శేఖరారూఢతను రవి చెలఁగె నెదుట. 168

తే. అలరుతమ్ముల నొకటిగా నాత్మఁ దలఁచి
దిశలు చెలువొందఁ దమము భేదించి తనను
లోకబాంధవ విఖ్యాతి లోకు లెన్నఁ
గరము వెలుఁగంగ బద్మినీ కాంతుఁ డలరె. 169
క. ఉరు కువలయంబు బెగడఁగ
ఖరకరుఁడు జనించి వచ్చి కలుగు సదాళిన్
వరుసఁ గని రూపు మాపఁగ
నరిగెను ద్విజరాజు పశ్చిమాంబుధికడకున్. 170
చ. సమయ కిరాటకుం డుదధి జాడల వచ్చుచుఁ జేరి పూర్వది
గ్రమణికి నమ్ముకో నుదయ రాగపువన్నెపటంబు విచ్చి చూ
పె, మదికి హర్షమైన, నది బేరము లాడి నిబద్ధమైన ని
ష్కము నొకటిచ్చెనో యనఁగఁ జాయలు దోఁప నినుండుఁ జెల్వగున్.
తే. ఒక్కయినుఁ డంతకంతకు నుక్కు మిగుల
నెక్కరాజది సూడంగ నోర్వలేక
డింది వెల్వెల నై యొక్కదిక్కు సేరె
ననఁగ సూర్యుండు హెచ్చె హిమాంశుఁ డడఁగె. 172
చ. సమయవినోది మిన్ననెడి చక్కని రంగమునందు సర్వది
గ్రమణులు చూడ గారడము రక్తినిఁ జూప విధుండు నాఁగ న
ద్దము నొకకర్ణమం దునిచి దాపలికర్ణమునందు హేమ చ
క్రము వెడలంగఁ దీసె ననఁగా రవి దోఁచెఁ బ్రభాప్రభావుఁ డై.

—* రాజు ధనకూఁతును గవి కిచ్చి పెండ్లిసేయుట *—

వ. ఆసమయంబున నంతకుమున్న మంగళతూర్యనాదంబులు వినుచు
మేలుకని మదనాభిరామ భూమీధవుండు స్నానసంధ్యాద్యనుష్ఠానం
బులు నిర్వర్తించి సముచితాలంకారుండై సభాస్థలంబునకు వచ్చి
మంత్రి పురోహితామాత్య బంధు విద్వజ్జనంబుల రావించి వారల
నుచితాసనంబులం గూర్చుండ నియమించి సుప్రసన్నుండై. 174

క. 'ఘనులార, బిల్హణాఖ్యున
కెనయఁగ మామక కుమారి నిచ్చెద నని నే
మనమునఁ దలఁచితి నిప్పటి
కనుకూలత; బ్రహ్మ పూర్వమందె ఘటించెన్.' 175

వ. అని యిట్లు పలికి, వారలయనుమతంబున ముహూర్తనిర్ణయంబు
సేయం దలంచి జ్యోతిర్విదులఁ బిలిపించి యడిగిన వారిట్లనిరి. 176

క. 'గురు కవి యుక్తి నినుండున్
వరుస నమందాత్ముఁ డగుచు వసుధఁ బరఁగినం
బరికింపఁగ ద్విజరాజున
కురుతరముగ మంగళాప్తి యొప్పగు వేడ్కన్. 177

తే. ఏ కుమారిక యళి యయ్యె నాకపీంద్రుఁ
డలర ధను వయ్యె, నిర్వుర కనుగుణంబు,
గ్రహవిరోధంబు నెందులఁ గానఁబడదు,
రాజబల మొప్పు, నొప్పుఁ దారాబలంబు. 178

క. ఈకన్య కిపుడు ద్విజరా
జాకడ నాఱింటఁ జెల్వమలరినవాఁడై
చేకొని పదిటను మిత్త్రుత
శ్రీకరముగ నొప్పు నతను సిద్ధి నృపాలా.' 179

వ. అని యిట్లు పలికిన సంతుష్టాంతరంగుండై నృపపుంగవుండు నిజనగరం
బలంకరింపం జేయుం డని పరిచారకులం బంచిన. 180

సీ. పచ్చల తోరణ పంక్తులు ఘటియించి,
కస్తూరిపూఁతలు గా నొనర్చి,

మలయజ పంకంబుఁ జిలికి, జవ్వాది రే
ఖలు దీర్చి, రత్న వేదుల నమర్చి,
ముత్యాల నవరంగముల రంగు గావించి,
నవ వజ్రమయ వితానములు నెఱపి,
వాసి తాగరు ధూప వాసనల్ నిగిడించి,
పగడాల మెఱయు చప్పరము లునిచి,
తే. ప్రతిగృహంబుల భద్రకుంభములు నిలిపి,
దర్పణంబులు ద్వారబంధములఁ గూర్చి,
ధవళ సౌధాళిఁ జిత్ర కేతనము లెత్తి,
పురము శోభిల్లఁ జేసి రబ్బురము గాఁగ.
సీ. ఏవీథిఁ జూచిన నింపుమై మంగళ
తూర్యనాదములు సంతోష మొసఁగ,
నేచాయఁ గాంచిన హితముగాఁ జెవులకు
వీణారవంబులు వేడ్క సేయ,
నేపట్టుఁ గనిన భేరీ పట హాది కా
హళ మృదంగైక వాద్యములు వెలయ,
నేచోటు వీక్షింప వాచా చమత్కృతిఁ
బాటలు మాటలుఁ బరఁగవిల్ల,
తే. నొప్పెనక్షత్రవల్ల భాభ్యుదయమునకుఁ
జెలఁగి మిన్నంది యుబ్బిన జలధికరణిఁ
దనరఁ గవిరాజశుభమహోత్సవమునకును
నగరరాజంబు సంత తానంద మొంది.
క. అత్తఱి నయిదువ లారతు
లెత్తుచు ధవళములు పాడ నింపు దలిర్పం
గ్రొత్త గనిపింపఁ బెండిలి
చిత్తరుఁజవిక కరుదెంచె క్షితిసురుఁ డెలమిన్.
సీ. ఈ ధామనిధికరం బెనయంగ నలుఁ గిడ
నేర్తువు, పద్మిని, నీవు రావె;

266
2.3.23.

యీ కళానిధిఁ జేరి యెలమి సేవలు సేయ
నేర్తువు, మృదుహస్త, నీవు రావె;
యీ చతురాస్యుతో నింపుమైఁ బలుకంగ
నేర్తువు శుభవాణి, నీవు రావె
యీ మహాసర్వజ్ఞు నిర వొంద శిర నంట
నేర్తువు, శశిరేఖ, నీవు రావె;
తే. యనుచుఁ దమలోన భూమిపాలానుమతిని
సరస సల్లాప వచన రచనలు దెలుపు
నంగనారత్నములు గొంద ఱాసువర్ణ
గాత్రుఁ గదియుచు మంగళార్త్రి కలిడి. 184

క. 'మంగళము రాజనుతునకు
మంగళ మంబుజముఖీరమాతనయునకున్
మంగళము శాస్త్రవేదికి
మంగళము కవీంద్రమాళిమణికి సుగుణికిన్.' 185

వ. అనుచు నారతిపాటలు పాడి శిరంబున నక్షత లునిచి. 186

చ. నడుము మసియాడఁ జన్నుఁగవ నాట్యము సల్పఁగ, రత్నహారముల్
దడఁబడి డోలికాకలనఁ దార్కొన, వేణి చలింప, నెమ్మొగం
బాడలును జెక్కుటద్దములు నొయ్యఁ జెమర్పఁగఁ, గంకణంబు లే
ర్పడి రవ ముప్పతిల్ల, నొక భామ తలంటుఁ గవీంద్రమాళికిన్. 187

తే. తావియటకలిఁ దలఁ బుల్మి తమక మొప్ప
బంగరు కటాహములలోనఁ బొంగు జలముఁ
బాట్లు గావించి బిందియ న్బట్టి యొక్క
యతివ సుకవికి మజ్జనం బార్చె నపుడు. 188

సీ. తడియార్చి వలువ లేర్పడ నిచ్చె నొకలేమ,
యుదిరిపావా లుంచె నొక్కభామ,
పువ్వులు సిగఁ జుట్టెఁ బోలు పొంద నొకకొమ్మ,
మురువుల నిడె నొక్కముద్దుగుమ్మ,

కస్తూరితిలకంబు ఘటియించె నొకచాన,
యొడల గంద మలందె నొక్కజాణ,
చొకట్లపోఁగులు సవరించె నొకబాల,
యురుహారములు పూన్చె నొక్కగోల,
తే. పడఁతి రత్నపుటుంగరాల్ దొడిగె నొకతె,
వెలదిక ర్పురంపు సురఁటిచే విసరె నొకతె,
నిలువుటద్దంబు ముందర నిలిపె నొక్క
మగువ, బిల్హణకవిశిఖామణికి నపుడు. 189
క. ఈరీతిఁ గవిని చెలు లిం
పారఁగఁ గయిసేసి నృపవరాత్మజ కెంతో
నీరాటం బొనరిచి సిం
గారించిరి వేడ్కఁ బొడమ గ్రక్కున నంతన్. 190
క. సరిగంచుచీర కటిపై
నెరయంగాఁ గట్టి, అవిక సీపై మెఱయన్
సరిగుబ్బలు గుబ్బతిలం
గరముల సవరించి, పైఁట గావించి రొఁగిన్. 191
క. ఇఁకఁ జక్కవాసెనే యని
చికురంబులు చిక్కు దీర్చి చెలువుగఁ గీల్గం
టొకయింతి వెట్టి, నొక్కతె
సకి ముడి బాగుపడెననుచు సన్నుతి సేసెన్. 192
తే. సూర్యచంద్రులు మైత్త్రిచే సుదతివదన
వనజ మంతయు సంతత వైభవంబు
నందఁ జేయ వసించిరో యనఁగ నపుడు
సూర్యచంద్రుల సిడె నొక్కశోభనాంగి. 193
ఉ. కోరిక నాఁకలిం గొని చకోరికముల్ జవ ముప్పతిల్లఁగా
సారసవైరియం దమృతసారము నూఁటుచుఁ దోనె తద్గతం
బై రహిమించు నల్పుగొన నత్తఱిఁ జాఱె ననంగ నొక్కసిం
గారపుబొమ్మ వాలుఁ దెలి గన్నులఁ గాటుక దీర్చి బోటికిన్. 194

తే. తారకావళిసేవ్యమై తనరునట్టి
చంద్రబింబంబుతోడుత సాటి గాఁగ
జెలువమోమునఁ గస్తూరితిలక మునిచి
ముత్తెములచేరు లమరించె ముదిత యొకతె.

క. అద్దములవంటిచెక్కుల
నిద్దపు రుచు లుప్పతిల్ల నీటుగ శ్రుతులన్
ముద్దులగుమ్మొకతె దా నొక
ముద్దియ కుండలము లునిచె ముద్దులు గాఁగన్.

క. సంగతిగ మోవి చవిచూ
డం గవి యురుదెంచె ననఁగఁ దారొక్కన నాసన్
రం గలర నాణిముత్తెపు
ముంగఱఁ గీలించె నొకతె ముదితామణికిన్.

క. దరము వివరం బెఱింగియు
వరుసం దనజన్మసీమవారిని వేడ్కన్
భరియించె ననఁగ నొక్కతె
యురుకుచమెడ ముత్తెసరుల నునిచెం బ్రేమన్.

క. స్ఫుటముగ నీయుత్సవమునఁ
గటకంబులు మ్రోసె ననుచు ఘన మణి భాస్వ
త్కటకమ్ము లునిచె నొక్కతె
కుటిలాలక కరములందుఁ గొమరు సెలంగన్.

క. ధరఁ గొని పిఱుఁదులు దీవుల
సిర వొందఁగ నాక్రమించి యేతె నటంచున్
బిరు దుంచినగతి యొక్కతె
యొరయఁగ రత్నముల కాంచి నునిచెం జెలికిన్.

క. కరిగమన నడలు మదనుని
కరిగతులను ధిక్కరింపఁ గల వని యందెల్
సరి మ్రోయఁగఁ జరణంబుల
నరు దారఁగ నిలిపె నొక్కయతివ ముదమునన్.

క. ఈవిధమున రమణీమణి
లావసుధావరునిపుత్రి కంచితలీలన్
వేవేగ యలంకారము
గావించి వివాహవేదికడ నిల్పుటయున్.

సీ. సతివీక్షణములు రసప్రవర్తకము లై
నెమ్మోముదమ్మిపైఁ గ్రమ్మికొనఁగ,
బిసరుహేక్షణ దృష్టులు సుమనోహరము లై
గళ సుగంధ విశేషకలనఁ బొదలఁ,
దరుణాంగి చూపు లత్తఱి శిలీముఖము లై
హృదయ పంకజ మావహించి నాట,
భామినీ లోచనప్రభలు వరాళు లై
తన రారు పాదపద్మముల వ్రాలఁ
తే. బరఁగి కవిరాజు పూర్వవైఖరిని మోహ
కలిత విభ్రమ విస్మయాక్రాంతుఁ డగుచు
వనిత రాయత్త చిత్తుఁ డై యాత్మలోనఁ
జెలువ భావంబు గాంచి వీక్షించుచుండె.

సీ. ఈ సర్వమంగళ యీక్షణకాంతులు
భరిత సుధాకరప్రభలు గాఁగ,
నీ శ్యామ కన్దోయి నింపారు దీప్తులు
పూసిన రతికాంతు భూతి గాఁగ,
నీ సతి కన్నుల భాసిలు దీధితుల్
పొలు పొందఁ దమ్ముల పూజ గాఁగ,
నీ యార్య లోచనచ్ఛాయలు మాళిపైఁ
బ్రవహించు గంగాఝరంబుఁ గాఁగఁ,
తే. బరఁగు కవిరాజమౌళి సర్వజ్ఞమూర్తి
విలస దసమాంబక స్ఫూర్తి విశదకీర్తి
యంచి తాచల భోగ భాగ్యైకవర్తి
యనుచు నచ్చటివిబుధాళి యభినుతింప.

సీ. భావి ఫలోదయ ప్రాప్తిభాసురము లై
పరఁగు మౌక్తికముల బారు లనఁగ,
రతిపంచశరులు సంతతకేళిఁ దేలుచుఁ
బనివడి యాడు పూబంతు లనఁగఁ,
దియ్యవిల్తుఁడు రెండుతెఱఁగు లై యిరువుర
కడ లందివేయు మార్గణము లనఁగఁ,
దనవలనను వీరు దనరారి రనుచుఁ జం
ద్రుఁడు సల్లు నమృత బిందువు లనఁగ,
తే. జెలఁగు నయ్యామినీపూర్ణతిలక చూపు
లనఘ కవివర్యుచూపు లన్యోన్యమైత్రి;
నెలయుచు గతాగతంబు లై కలయ నడరి
వెలయఁ జూచెడు జనులకు వేడ్క సేసె. 205
తే. లలితముగ విప్రులు 'త దేవ లగ్న' మనుచు
మంత్రములు సెప్ప, శుభపీఠి మహితలీల
వరుస నుంచిరి తద్వధూవరుల నృపతి
యనుమతంబున నైదువు లపుడు వేడ్క. 206
తే. పుడమివేల్పులు పుణ్యాహ పూర్వకముగ
దేవతాహ్వాన మొనరించి తివిరి వారి
కరములను గంకణములు వేడ్కను ఘటించి
చదివి రెంతయు మంగళాష్టకము లపుడు. 207
మ. పొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్య నిచ్చుపగిదిన్ క్ష్మానాథముఖ్యంబు తా
బొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్య నిచ్చె సుమనస్సంతానముల్ మెచ్చఁగన్. 208
క. దలఁబ్రాలపళ్లెరంబులు
వెలఁదులు పార్శ్వములఁ బూన విభునిశిరమునన్
జలజాక్షి ముంచి దోయిటఁ
దలఁబ్రాలను బోసె విభుఁడుఁ దనపై నుంచెన్. 209

వ. ఇట్లత్యద్భుతంబుగఁ దదుత్సవంబు విధ్యుక్తప్రకారంబుగఁ గావించి భూసురులకు మ్రొక్కి తదాశీర్వచనంబులు గైకొని బిల్హణుండును, యామినీపూర్ణతిలకయును యథేష్టభోగంబుల నుండునెడ. 210

సీ. నీలమేఘంబులు శైలాగ్రముల వ్రాలెఁ,
బరికింప వెల్వెలఁ బాఱె విధుఁడు,
సన్నగించెను బికస్వరము లంతంతకుఁ,
గలహంసగతుల సంగతులు దప్పె,
గగనమార్గము సావకాశ మైబలు పొంచె,
నహిరాజు రూఢి సందంద నిలిచెఁ,
గేతకిదళములు గెలఁకుల భాసిల్లె,
మెఱుపుఁదీఁగలు మింటఁ దఱచు మెఱసె,
తే. నంద మొప్పఁగఁ గొలఁకుల నంబు వ్రజము,
నాడకాడకుఁ గోకిల లతిశయిల్లె,
ననుచు జను లెల్లఁ బొగడ ఘనాగమ మన
గర్భగౌరవ మాకాంత గాంచె నంత. 211

వ. నవమాసంబులు నిండ దశమమాసంబున నొకసుముహూర్తంబున.

మ మరుదంకూరము సంచరింప, గ్రహముల్ మార్తండునిం జేరకే
నెరయన్, దిక్కులు దెల్విఁ జెంద, గరిమ స్త్రీవ్య న్మృదంగాది వా
ద్య రవంబుల్ సెలఁగన్, సురప్రతతి యుద్యత్పుష్పవర్షంబులన్
బొరి వర్షింప, వధూటి గాంచెను సుతున్ భూరిప్రభా ఫ్రొన్నతున్. 213

క. ఘనతం బ్రభాకరోదయ
మున జనియించుటయు విప్రముఖ్యులు వేడ్కం
గని లగ్నగతిఁ బ్రభాకరుఁ
డను నామం బిడిరి బిల్హణాఖ్యుఁడు మెచ్చన్. 214

వ. అప్పుడు మదనాభిరామభూమీాధవుఁడు విద్వజ్జనబంధుమిత్త్రపురోహిత మామాత్య సమక్షంబున నతనిం దన వంశకర్తగాఁ బరిగ్రహించి జాతకర్మాదులు సలిపి గోభూ తిల హిరణ్యాది షోడశ దానంబులు నేసి భూసు రాశీర్వచనంబు లందె. 215

...నుఁడు ప్రభాకరుఁ డంతఁ
దినదినమును వృద్ధిఁ బొంది దీవ్యద్బలుఁడై
కనుపట్ట వానిఁ బట్టము
చన నొప్పఁగ గట్టితాతసౌఖ్యము గాంచెన్. 216

(మాలిని)

ప్రథితగుణకలాపా భంజితేశానచాపా
ప్రథనవిజయకోపా భానుకోటిప్రతాపా
మథితదనుజదీపా మన్మథాచ్ఛస్వరూపా
మధురతరకలాపా మాన్య రామావనీపా. 217

(గద్యము)

ఇది శ్రీ సీతారామ చరణ సేవా ప్రభావ
సంపాదిత కవితా విచిత్ర కాశ్యపసగోత్ర పవిత్ర
శ్రీమత్పండిపెద్ది కృష్ణస్వామిప్రణీతం బయిన
బిల్హణోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.

---

బిల్హణీయము సంపూర్ణము.

26655
25.3.73



# ఆంధ్ర-బిల్హణీయము

వేదము వేంకటరాయశాస్త్రిచే

894.8131
VEN-A

మద్రాసులో
స్వకీయ జ్యోతిష్మతీముద్రాక్షరశాలయందు
ముద్రితము.

*All Rights Reserved.*

1914.

వెల 8 అ.]

శ్రీ

# ఆంధ్రబిల్హణీయము.

## అవతారిక.

---

ఆంధ్ర బిల్హణీయము రసోత్తరంగ మయిన ప్రబంధ మని సాక్షరులైన యాంధ్రుల కెల్ల తెల్లము. అట్టి యా భవ్య ప్రబంధమున ఛందోవ్యాకరణ విరుద్ధ ప్రయోగములే గాక స్త్రీల సాంగత్యమునం బురుషులును పురుషులసాంగత్యమున స్త్రీలును పఠింప ననర్హంబు గా నితరదోషంబులును బెక్కు లుండుటం గాంచి రసాభిమానంబుచేత యథామతి వాని నెల్లం దొలఁగించి గుణము కలిగించి, పఠితలకు సుబోధం బగునట్లు వాక్యావాంతరవాక్యాది విచ్ఛేద చిహ్నంబులు సమకూర్చి ముద్రించినాఁడ. ఈముద్రణము రసికవిద్వజ్జనసమాదరణీయం బయినచో కృతార్థుఁడను.

ఈగ్రంథమును రచించినవారు పండిపెద్ది కృష్ణస్వామి యని దీనియం దున్నది. వీరు మదరాసులో చేపాకసౌధములో నివాసము చేసిన యార్కాటునవాబుగారికి దివానుగా నుండి సహృదయ వతంసులై విద్వజ్జన పోషకులై కీర్తి వహించినవారు, వెలనాటి వైదిక శిఖామణులు. వీరు దీనిని చిత్రకవి వంశజుఁడును సింగరార్య తనూభవుఁడును అగు నారసింహార్యకవియొక్క ప్రోత్సాహ సాహాయ్యంబులచే రచించి నట్లు ఇందుఁ జెప్పఁబడి యున్నది.

అయినను, ఇందలి ప్రథమాశ్వాసాంత చక్రబంధమువలన ఏతత్కవి సింగరార్యుఁ డనియు, కృతినాయకుఁడు చెన్నభూపాలుఁ డనియు, తెలియవచ్చుచున్నది.



ఈచక్రములో వృత్తపాదక్రమమున ఆకులలో తుదినుండి మూఁడవయక్షరములను వరుసగాఁ జదివిన 'సింగరార్యకవి' అగును. అట్లే కుండనుండి అయిదవయక్షరములం జదివిన 'చంన భూప కృతి' అగును.

ఇందువలన నారసింహార్యకవి తనతండ్రి రచించి చెన్నభూపాలుని కంకితము చేసిన యీప్రబంధమును ధనాదిసత్కారార్థి యై కృష్ణస్వామికృతముగా ధామాంకితముగా మార్చె ననియు, చక్రబంధంపు

గుట్టుం గనక కృష్ణస్వామిగారు కవియశఃకాము లై స్వప్రణీతముగా వెల్లడించికొని రనియు నూహింపఁ దగియున్నది.

ఈసింగరార్యకవి యింటిపేరు క్రొత్తపల్లివారు. ఈతఁడు రాఘవ వాసుదేవీయ మను నొక ద్వ్యర్థికావ్యమును రచించి కామినేని బంగారంకభూపాలుని కంకితము చేసినాఁడు. తాను బిల్హణీయము రచించి నట్లు ఆగ్రంథములో చెప్పికొనియున్నాఁడు.—

'అనెడు నన్ను బుధులు గొనియాడ బిల్హ
ణంబు మొద లైన కృతుల నాంధ్రమున వింటి;
మిపుడు భగవత్కథాప్తి నూహించునట్టి
కావ్యము రచింపు శ్లేషోక్తి కవులు మెచ్చ.'

కామినేని ప్రభువులు పద్మనాయక వంశజులు, నెల్లూరు జిల్లాలో నాయఁడుపేట ప్రాంతములలో నుండినవారు.

ఇందలి బిల్హణుఁడు విక్రమాంకదేవచరిత్రమును రచించి నాతఁడో అన్యుఁడో, ఆచరిత్రము రచించినయాతఁడు అందులోనే తాఁ జెప్పుకొన్నట్లు కాశ్మీరమునుండి తాను సంచరించుచున్న దారిలోనే యున్న ధారాపురమున భోజరాజును దర్శింపక కుంతలదేశమున కేఁగినందులకు కారణ మేమో, తెలియకున్నది. ఆతఁడే యీతఁ డనియు, రాజకన్యా సందూషణ రూప దుశ్చరిత్రమే యీతఁడు భోజుని దర్శింపమికి కారణ మనియు, పిమ్మట ఆకన్యను తండ్రి యితనికిం బెండ్లి సేయుట మిథ్యగానోపు ననియు, కొందఱు ఊహించుచున్నారు.

ఈకావ్యంబును శశాంక విజయంబును బోధించు నీతులు:—

'ఘృత కుమ్భ సమా నారీ, తప్తాఙ్గార సమః పుమాన్;
తస్మాద్ ఘృతం చ వహ్నిం చ నైకత్ర స్థాపయే ద్బుధః.'
'మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్;
బలవా నిన్ద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి.'

సెప్టెంబరు, 1914. వేదము. వేంకటరాయశాస్త్రి.

2660 —
25·3·72

# విషయసూచిక.

# వేదము - వేంకటరాయశాస్త్రిగారి

## —*ఆంధ్ర గ్రంథములు*—

మహాకవి శ్రీనాథ ప్రణీత మైన శృంగారనైషధము వేంకటరాయశాస్త్రి విరచిత సర్వంకషాఖ్య వ్యాఖ్యతో ముద్రితమైయున్నది.

| | ర. | అ. |
|---|---|---|
| ఈగ్రంథము సామాన్యముద్రణము (Popular Edition) రాయల్ 8 పుటల ఫారములలో 824 పుటలు, కాలికోబైండు. | 4 | 0 |
| ఇదే. గ్రంథకోశ ముద్రణము (Library Edition) కాలికో బైండు. | 6 | 0 |
| ప్రియదర్శికానాటిక.—సతాత్పర్యము. | 0 | 6 |
| ఉషానాటకము.—కలలో ఉషపెండ్లి. (సటిప్పణము) | 0 | 8 |
| శాకుంతలనాటకము.—కాళిదాసకృతికి సరియైన తెనుఁగు. | 0 | 8 |
| ప్రతాపరుద్రీయనాటకము—సటిప్పణము. | 1 | 0 |
| నాగానందనాటకము.—సటిప్పణము. | 0 | 8 |
| ఆంధ్ర ప్రసన్న రాఘవనాటక విమర్శము. | 1 | 0 |
| కావ్యాలంకారచూడామణి. విన్నకోట పెద్దనకవి | 0 | 12 |
| పారిజాతాపహరణము. 4 అ. పెద్దయక్షరములు. | 0 | 6 |
| మడికి సింగన జ్ఞానవాసిష్ఠ రామాయణము. | 1 | 0 |
| విజయవిలాసము, సటీక చేమకూర-వేంకటపతి కవి. | 1 | 0 |
| సారంగధరచరిత్ర, ,, ,, ,, ,, | 0 | 12 |
| గౌరన హరిశ్చంద్ర ద్విపద.—సటిప్పణము. | 0 | 12 |
| విసంధివివేకము | 0 | 1 |
| ఆముక్తమాల్యద సవ్యాఖ్యానముతో త్వరలో వెలువడును. | | |
| సారంగధర ద్విపద.—సటిప్పణము. | 0 | 4 |
| తెలుఁగు బిల్హణీయము. | 0 | 8 |
| ఈ క్రిందివి సులభవచన గ్రంథములు. | | |
| కథాసరిత్సాగరము ౧-వ సంచిక. | 0 | 8 |
| హితోపదేశకథలు.—నీతిబోధకములు. | 0 | 8 |
| భోజకాళిదాసకథలు—రసభరితములు. | 0 | 8 |
| బేతాళుని యద్భుతకథలు.—ప్రజ్ఞ కలిగించునవి. | 0 | 8 |
| విక్రమార్కుని యద్భుతకథలు.—గుణముకలిగించును. | 0 | 8 |
| కథాసరిత్సాగరము—మొదటి కూర్పు. చిన్న యక్షరములు. అద్భుత నీతి వ్యవహార కథలు. | 2 | 8 |

శ్రీ రస్తు.

# బిల్హణీయము.

---

## ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాస్తుత్యాదికము.

శా. శ్రీరామావనిజా నిజాయతభుజా శృంగారశాఖా మిళ
త్సారాకారలతాస్తనస్తబక భాస్వద్దంతవాసః కిసా
లారాళాలకభృంగ రంగదఖిలాం గాంచత్ప్రసూ నోత్కర
శ్రీరామాకృతి కల్పకంబు మము రక్షించుఁ బుధానందమై. 1

క. భవ సరసిజసంభవ ముఖ
భువనస్థ సమస్త దేవ ముఖ్యుల కెలమిం
బ్రవిమల మతి ప్రమొక్కెద మ
త్కవితకు సంతతము సత్ప్రకాశము గలుగన్. 2

క. ధర దోషోదకముల నిడి
గరిమన్ సుగుణామృతంబు గాంచు సుకీర్త్యా
కర వర మానస పద సం
చర సత్కవిహంసములను సరవి నుతింతున్. 3

తే. నిర్మలావయవమ్ముల నెమ్మి విడిచి
వ్రణములకుఁ బాఱుమక్షికా ప్రతతిభంగి
నొప్పులు గ్రహింప కెప్పుడుఁ దప్పు లరయు
కాకవుల లోకముల నే నిరాకరింతున్. 4

వ. అని యివ్విధంబున నిష్టదేవతానమస్కారణంబును సత్కవిపురస్కార
ణంబును గుకవితిరస్కారణంబునుం గావించి, యేనొక్కనాఁ డెక్కువ

యగు మక్కవం జొక్కి హృద్య విద్యాలు గొలువం గొలువుకూటంబు నధివసించి సమంచితగతుల నతులవై ఖరి దీపించునవసరంబున.

తే. చిత్రకవి వంశ దుగ్ధాబ్ధి శీతభానుఁ
డనుపమానోక్తి శ్రీసింగరార్యసూనుఁ
డమిత కవితా విశేషజ్ఞుఁ డనఁగ వెలయు
నారసింహార్యకవి వచ్చి నన్ను మెచ్చి,— 6

క. "శ్రీపండి పెద్దిసత్కుల
దీపక కాశ్యపసగోత్ర దీవ్యన్నా నా
భూపాలక మకుటమణి
శ్రీపదపాదాగ్రభూమి కృష్ణస్వామీ. 7

సీ. కుత్సిత కాణాద కుత్కీలక విభేద
సంశక్త యుక్తివజ్ర ప్రహార,
యణకాంక్ష పాణినీ యాటవీ పాటన
చటుల సూక్తివిహార పటుకుఠార,
నిర్ణీతికృత జైమినీయ తూలోద్ధూతి
సంస్కార వాక్య ఝుంఝూసమీర,
దుర్మత వేదాంత మర్మ తమ శ్ఛేద
భాసుర వచనప్రభావ సార,

తే. కావ్య నాటక లసదలంకార సాహి
తీ సముత్పన్న రస లస ద్ధీర హృదయ
పండిపెద్దికులీన సంపన్ని ధాన
పాలితకవీంద్ర శ్రీకృష్ణపండితేంద్ర." 8

వ. అని వినుతించి, 'వినుము భవదీయంబు లగు చతుర్దశవిద్యాప్రభావంబులు సకలభాషావిశేషంబులు సమస్తచమత్క్రియా వినోదంబులు నెన్న నిన్నరులకుఁ దరంబు గాదు. నిఖిలలోకంబులఁ గృతిముఖంబుగాఁ గీర్తి నిత్యం బగు. నట్టికృతులయందు నాంధ్రం బతిరమణీయంబు. గావున నొక్కపురాతనకథ నాంధ్రప్రబంధంబుగా రచియించి శా

మాంకితంబు సేసి యాచంద్రతారకం బగుసత్కీర్తిం గాంచు.' మనిన
నేనును సంతోషితాంతరంగుండ నగుచు. 9

క. మున్నింద్రతనూభవునకు
వెన్నుండు సహాయుఁ డైనవిధమున, నే నా
సన్నుత సద్గుణ గణ సం
పన్నుం డగుకవివరాధిపతి సాయమునన్. 10

—* షష్ఠ్యంతములు *—

క. శ్రీ జనకసుతా హృదయ స
రోజాతద్యుమణి కజ విరూపాక్ష సురు
ద్రాజ ప్రముఖామర్త్య స
మాజాగ్రణి కరిజనాసు మరు దసిఫణికిన్. 11

క. తుండీంద్రం తుండనిభ దో
ర్దండ స్ఫుట కాండ నిర్జిత సుహ్వాద్దం డా
ఖండల రిపు కాండునకున్
ఖండపరశు చండ కార్ముక విఖండనునకున్. 12

క. సుందర పదారవింద మ
రంద ముదిత బుధపురందర మిళిందునకుం
గుంద శరత్కంద వృష
స్యందన చందన కన ద్యశఃకందునకున్. 13

క. హరితనయ హృదయ సారస
హరికి మహాసూనృతజితహరి కలి తేజః
పరిహాసితహరికి భవగజ
హరికి సదాపాదపంకజానతహరికిన్. 14

క. పర ధీ ధిక్కృత చక్రాం
గరథికి సౌందర్య హసిత కరథికి వినమ
చ్ఛరధీకృత శరధికి దా
శరథికి ధృతశరధి తురగ శాత్రవ రథికిన్. 15

క. శాంతునకు దాసహృదయ ని
శాంతునకు నితాంత నయనచాకోరయుగా
క్రాంత మహీజాస్య కళా
కాంతున కానంద భరిత కపికాంతునకున్. 16

క. రావణహరణునకు జితై
రావణచంక్రమణునకు ధరారమణునకున్
బావనజన భరణునకున్
భావన యాభరణునకు నభంగరణునకున్. 17

క. రామునకు నీలమేఘ
శ్యామునకు దివాకరాన్వయాంభోధిసుధా
ధామునకు పరశురామ వి
రామునకు సమస్త భూవర లలామునకున్. 18

వ. అంకితంబుగా నాయొనర్పం బూనిన బిల్హణోపాఖ్యానం బనుమహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 19

—* పురవర్ణన *—

తే. వసుమతికి నాభిభూత మై వఱలునట్టి
భస్మశిఖరికి నుత్తర భాగమందు
ద్రుపద లలితంబు సుజన సందోహ చరిత
దివ్య దేశంబు పాంచాల దేశ మమరు. 20

వ. అందు. 21

శా. శ్రీరామామణి కాటపట్టు హరికిన్ శృంగారవాసంబుఁ జె
ల్వారత్నంబుల కెల్ల నాకరము సమ్యగ్వాహినీపాళి కా
ధారం బన్యదురాసదంబు విబుధత్రాణంబు రాజాప్తిచే
శ్రీరమ్యాం బయి సింధురీతిఁ బురి లక్ష్మీమందిరాఖ్యం దగున్. 22

క. ఆపురము జయశ్రీలకుఁ
గాఁపురము సమంబు ద్వారకాపురమునకున్

భూపురములలోఁ జెల్వగు
గోపుర ముఖ చుంబి తైక గోపుర మగుచున్. 23

క. సతత శిరస్స్థల విసర ద
దితిసుత తటినీ తుషార దీప్తాబ్జము లై
నుతికెక్కు సౌధరాజము
లతులిత శివ మూర్తు లనఁగ నప్పురిలోనన్. 24

ఆ. కనక గోపు రాగ్ర ఘటిత గారుత్మత
రత్నరుచులు కుముద రాజులేడి
తోడరి మెసవఁజూచు దూర్వాంకురము లని,
చను మృగేంద్రముఖము లుసికి నులికి. 25

సీ. ఒకచోటునను బోటు లోగి నీటు గొని మీటు
వీణెల నాదంబు వేడ్క సేయ,
నొకచెంగట నభంగ సకలాంగ యుత మంగ
ళ మృదంగ రవము ధింధిమి యనంగ,
నొకవంక గతశంక నకలంకముగఁ బంక
జాస్యలు చెలఁగి లాస్యములు సలుప,
నొకచెంత వగఁ గాంత లాగి వింతఁ గొని సంత
సము మీఱ సరస గీతములు పాడ,

తే. వెలయు బహువిధ వాద్య సంవేద్యహృద్య
ఘుమఘుము మూర్భటి దిక్కులఁ గొమరు మిగుల,
జనుల కానందరసము నిచ్చలు ఘటించు
రంజితావనిజాని యారాజధాని. 26

సీ. సు రసాల సంతతి సుర సాల సంతతి
గతి ఖగాళికి ఫలోన్నతి యొసంగు,
మహిత కాంచనములు మహిత కాంచనముల
ఘాలిక నామోదములు ఘటించుఁ,

గలిత పున్నాగముల్ కలిత పున్నాగము
లట్లు కొమ్మలతోడ నమరియుండు,
రంభాదినటనము రంభాదినటనము
కరణి మరుత్ప్రసంగములఁ బొదలుఁ,
తే. బనస లెంతయుఁ బనసలభాతి ద్విజుల
కును బద్రక్రమసంయుక్తిఁ గొమరు మీఱు,
నగము లున్నతి నగములపగిది వనుల
నలరు చుండు విపత్త్రింబు లగుచుఁ బుడమి. 27

క. ఆవనములు ద్విజసందో
హావనములు తులిత వృత్ర హా వనములు స
త్సేవనములు మార్గిక సం
జీవనములు చరితభువనజీవనము లగున్. 28

మ. కులసంరక్షణులున్ సువాక్సుమహితుల్ గోత్రాహితుల్ జాతవే
దులు ధర్మాత్ములు భానురాఖ్యభువనాప్తుల్ సజ్జగజ్జీవనుల్
కలితార్థప్రదులార్జితార్యులు కనత్కాంతుల్ తమోదూరు ల
య్యులధాత్రీసురు లెంతయున్ విబుధులై యింపొందుట ల్చిత్రమే.

సీ. చక్రములనుఁ గీడు సలుపని రాజులు,
దివిరి సత్త్రముల భేదింపనియిను,
లిలఁ గుభృత్తులకు వెన్నీని కూర్మిపతులు,
గోత్రవర్గము బల్మిఁ గూల్ప నింద్రు,
లరికి మార్గ్మాగము గానట్టి పూరుషసింహు,
లనయంబు మూల నుండనిమహేశు,
లాకనిదాఁపునఁ జేర నోపనిశ్రీదులు,
పుణ్యాంబు దప్పని పుణ్యజనులు,
తే. సార వీరన వీరన వైక పరులు
పరఁగుదురు పురి శుచిభాను వంశ్యు లగుటఁ

కువల యానంద సంధాయి గురు తమోప
సరణ నైపుణ్యనిధులు రాజన్యవిధులు. 30

మ. ఒకశంఖంబునఁ బొంగు నర్థపతి యుద్యోగంబు దామున్ భజిం
పక, రత్నాకరుతోడిసఖ్యమునకుం బాటించి, సంఖ్యాధిక
ప్రకటార్థాఢ్యతచేఁ జెలంగి, బహు మిత్రప్రాభ వాఖండ రూ
పక సంప ద్విభవంబుఁ గాంతురు పురిన్ వైశ్యోత్తముల్ వేడుకన్. 31

క. హాలపాణి యొక్కఁడె రే
గలవాఁ డని తెలియఁజేసి కడువేడ్కఁ బురిం
గల విష్ణుపాద జావళి
యలగారె సువర్ణయుక్తి వ్యవసాయమునన్. 32

చ. సరసిజబాంధవుండు, ముకుఁజాయ ననూరుఁడు తేరుదోల, సు
స్థిరతర తన్నిబద్ధ వర జిహ్మగ పాశము లోలి వ్రేల, న
ప్పురికరు లబ్జనాళము లెపో యని తుండము లెత్త, దక్షిణో
త్తరముల నేఁగు భీతిమెయి దజ్జగతీక్షుఁడై రయంబునన్. 33

చ. వరుస నిజేశు మూలఁ బడవైచినయట్టిమరుత్తురంగమున్
సరిగొనకే జవంబు గొని సాగిన, నాశుగ మై సమీరుఁ డా
ర్చి రహించి రాఁ, దదాకృతి హరించెఁ బదోద్ధతధూళిఁ గప్పి త
త్పురి తురగోత్తమంబులు విభూషితసాదిబలోత్కరంబులై. 34

చ. సమములు గావు వాజు లని, సారథి కుంటని గాలికూడు ప్ర
గ్గము లని, చక్ర మొంటి దని, క్రాలు ననంత మణివ్రజ ప్రభా
వ మహితమై ఘనావరణ వైఖరితో నలరారు రాజితో
త్తమ రథరాజి భానునిరథంబు హసించు సదా సముద్గతిన్. 35

క. కట్టింతురు రుద్రు నయిన,
దట్టింతురు హరుల నైనఁ, దలఁగని కడిమిం
గొట్టింతురు యము నైనను,
బట్టింతురు రిపుల నెల్ల భటు లప్పురిలోన్. 36

సీ. తమ్ముల దోషాప్తిఁ గ్రమ్మి మాసిన ఱట్లు,
నయ శౌలులనుఁ బొట్టొనర్చుకొఱఁత,
వసుధ మహాహీను వశత నిల్పినసడి,
కల సదావర్తులఁ గలఁచునగడు,
భోగి నధోగతిఁ బొందించు పాతకం,
బాదిత్య కవుల మే లడుచు కొదువ,
కడుఁ గళానిధిఁ దమోగ్రస్తుఁ జేసినదూరు,
ఘనుల వివర్ణతఁ గలపుకలఁక,
తే. నలువ తప్పించుకొనియొఁ దన్నగరి సతుల
కలరు పదములు మృదు జంఘ లరిది పిఱుఁదు
లలఁతినాభులు మెఱుఁగుటా రలఘు కుచము
లమరు మోములు వర కుంతలములుఁ జేసి. 37

ఉ. కాంచన పద్మరాగ శశికాంత మణీ గణ కల్పి తోజ్జ్వలో
దంచిత సౌధ రాజములు తత్పురి నొప్పు ధ్వజాన్వితంబులై
మించినభీతిఁ బత్త్రియుత మేరు ముఖాచల పంక్తు లెల్ల నేతెంచె
ననంగ భూతిజిత దేవవిభుఁ డ్ధరణీంద్రుఁ గొల్వఁగాఁ. 38

వ. మఱియు నప్పట్టణంబు మణిఘటిత కాంచన ఘనావరణంబులును, ఘనావరణ నివారణ పటు పటాంచ లానిల కేతనాంచిత సౌధరాజంబులును, సౌధోపరి నిబద్ధ ముక్తామయ శిరోగృహంబులును, గృహారాజిత మణికవాటంబులును, గవాట విరచిత మరకతమణి శోభా విరాజమాన తోరణప్రకాశిత ద్వారంబులును, ద్వారోభయపార్శ్వ రమ్య రత్నవేదికలును, వేదికాంతర రచిత విద్రుమంబులును, విద్రుమ వైదూర్య స్తంభ సముదయంబులును, స్తంభ సంభృత శాత కుంభ కుంభ విలసిత మంటపంబులును, మంట పాభ్యంతర సంచర త్సుందరీజనంబులును, జనసందోహ సంపూరిత వీథికారాజంబులును, రాజకుమా రారూఢ సంచర ద్గంధసింధుర సైంధవ రథ నికరంబులును, కర విన్యస్త వీణావాదన ప్రవీణ గాయకులును, గాయక

యుక్త మృదంగ తాళాది లాస్య సంరంభ విజృంభమాణ రంభాసమాన వారకాంతలునుఁ, గాంత నిరంతర సురభి కుసుమ ఫల భరితోద్యానంబులును, నుద్యానాంతర కనత్కమల కల్హార మరందపాన తుందిల మిళింద బృంద ఝంకార ప్రమోద మేదుర సారస హంస చక్రాది జలవిహంగ సంకలిత సరసులును, సరస మనోహర పరిమళ మిళిత శీతల పవమానంబులునుం గలిగి, యమరావతీ విధంబున విబుధ గణ విభ్రాజమానం బై, తేజోవతీనగరంబుచందంబున లోహితాశ్వ విలసితం బై, సంయమనీ నగరంబు పోలువున సమవర్తి ధర్మరాజ విరాజితంబై, నిరృతినిలయంబుకైవడిఁ బుణ్యజనోద్దీపితంబై, వరుణ మందిరంబురీతి ఘన పుష్పమాలికాభిశోభితంబై, పవనునిగేహంబు భాతి నానా సుగంధ బంధురం బై, యలకాపురంబు బాగున ధననిధి మహితం బై, కైలాసంబులాగున రాజశేఖర రమ్యం బై, కమలగర్భు సదనంబుపోలిక మహిత భాషా సమన్వితంబై, హరి నివాసంబు చాడ్పున నిత్యముక్తానుగమ్యం బై, భోగవతీ పుటభేదనంబు తీరున మహాభోగి భాసురం బై, వాహినీపతి చందంబున శరణాగత భూభృజ్జాతం బై, సాకేత రాజధాని వడువున రామలక్ష్మణోపశోభితం బై, ద్వారకయుందంబునఁ గృష్ణ బలభద్రప్రకాశం బై, హాస్తిపురి వైఖరి గాంగేయాది భూషితంబై, యింద్రప్రస్థ పురంబు మాడ్కి ననుగత ధర్మజాతం బై, వారణాసిచూడ్కిఁ బ్రచండ కాల భైరవ శూలహస్త రక్షితం బై, సిరుల నిర వొందుచుండు. 39

—* రాజవర్ణనము *—

ఆజగతి కధీశ్వరుఁ డై
రాజిలు మదనాభిరామ రాజేంద్రుఁడు జ
న్యాజిత బాహా పవి ధా
రాజిత సమ దోన్న తారి రా డ్గోత్రుం డై. 40

రమణ లక్ష్మిమందిరమ్ము మేలమ్ముగాఁ
గని, సదాళి గుణమ్ముగా గ్రహించి,

మధుర ధర్మముఁ బూని మాధవు లోఁగొని,
యలఘు ద్విజావళి నాదరించి,
దాక్షిణ్యశాలి నొద్దనె నిల్పికొని, కళా
నిధిఁ బర్వమున రుచుల్ నింపఁ జేసి,
శోభితం బగు మహాసుకృతిభావముఁ గాంచి,
వర సత్య రతి మనోహరత మించి,

తే. కలనియం దుద్రమూర్తిసంకల్ప మడఁచి,
ఘన సుదృక్పాళికా మానకర్త యగుచు,
నతను విఖ్యాతిచే మదనాభిరాముఁ
డలరు నిజనామగరిమ యథార్థముగను.

సీ. విసములోపలఁ జిక్కి వెడలరాని స్వయంభు
లాలిత వాణీవిలాసుఁ జేసె,
నొంటికాఁడై దాన మొరుని వేఁడిన చిరం
తన మాని మేటి భూధవునిఁ జేసె,
నచలాధివాసుని నాది భిక్షుని సర్వ
మంగ లానుభవ సంప్రాప్తుఁ జేసె,
బహుళార్తి భేద విభ్రాంతిఁ గుందు కంళంకిఁ
దనతోడఁ గూడ సత్పతినిఁ జేసె,

తే. నెన్న నీగుణ మీధర్మ మొందుఁ గలదె?
తగ నయుక్తుల సంయుక్తులుగ నొనర్చు
నితని మదనాభిరామాఖ్య యిడిననలువ
కౌశలంబు గణింప శక్యంబె చూడ.

తే. రమ్యగుణశాలి యీ భూపురందరుండు
దారగాఁ గొని లీల మందారమాల
ననుదినముఁ గూడి క్రీడల నతిశయిల్లి
యవనిఁ బాలించె బుధనికాయంబు వొగడ.

## ప్రథమాశ్వాసము.

— *రాజపుత్రి* —

క. ఆ యనఘున కుదయించె న
హాయత గుణజాల బాల యంచితలీలం
దోయజసాయకు నాఱవ
సాయక మని భూజనాళి సన్నుతి సేయన్.

సీ. సకలంకసంగవాం ఛాసక్తి దగ దంచుఁ
గమలారిఁ దొరఁగిన కళ యనంగ,
మే నెఱుంగనివాని మిత్త్రిత్వ మసదని
మకరాంకు వీడ్కొన్న మాయ యనఁగ,
నిరవలంబావాస నిరతి కాని దటంచు
సురపథంబెడలిన చుక్క యనఁగ,
మలినాంతరంగ సంబంధ మాఱడి యంచు
మేఘంబు వీడిన మెఱుఁగనంగఁ,
తే. జాయలనుఁ జెల్వమైన శ్రేఁ బ్రాయమునను
జనుల కల్లారుముద్దుగా ననువు పఱచు,
నాటపాటలు సలుపుచు నవనిబాల
యామినీపూర్ణ తిలకా సమాఖ్య నలరు.

వ. ఆకుమారీరత్నంబనుదినప్రవర్ధమాన యై యున్నెడ.

క. మృగమదమున రుచి పుట్టిన
పగిదిని జెఱకునను బండు పండిన రీతిం
దగ సురభి పసిఁడి నొదవిన
పగటున యౌవనము దనరె బాలామణికిన్.

సీ. మహితయౌవనరూప మధుమధురాలాప
బింబోష్ఠి శ్రీవర్ణబింబకర్ణ
కంజాతదళనేత్ర కాంచననిభగాత్రి
చతురచంపకనాస చారుహాస
పటుసైకతశ్రోణి పల్లవాంచితపాణి

ప్రౌఢసౌభాగ్య సంపన్న యోగ్య
కరికుంభకుచపాళి ఘననీలరోమాళి
యబ్జారివదన కుందాళిరదన

తే. యలరు మరువంపు మొలక కాయజుని చిలుక
కలితకర్పూరతిలక సుగంధఫలక
యామినీపూర్ణతిలక నీలాంచదలక
రాజసము గుల్క శృంగారరసముఁ జిల్క;—

సీ. నలినాక్షికొప్పు కృష్ణత్వంబుఁ బ్రాపించు,
నెమ్మోము విధురీతి నివ్వటిల్లు,
నబ్జాస్యకన్ను లబ్జాలోకత వహించు,
నధరంబు మాధవఖ్యాతి నను,
నలివేణి చనుదోయి యచ్యుతత్వముఁ గాంచు,
జేయి పద్మాహిత స్థితి భజించుఁ,
నగకుచనూఁగా రనంతభూతిఁ జెలంగు,
లేఁగౌను శ్రీహరిలీలఁ దాల్చు,

తే. నాభి గమలాకరానంత శోభ నెసఁగు,
దనువు హేమాంశుకస్ఫూర్తిఁ దనరు నిట్లు
విష్ణుభావంబు చెలియందు వెలయుచుండు
క్షితిజనంబులు మెచ్చి సంస్తుతులు సేయ

సీ. ఎంతటివానినే నీనాతి వదనాబ్జ
మమరఁగా లోఁగొను, నద్ది మేమొ?
ఏధీరు నెద నైన నీలేమ చూపులు
నాటు, మనోజబాణంబు లేమొ?
ఎవ్వారి హృదయాళి కీతన్వి చన్నులు
సరి నిక్కఁ, గుసుమ గుచ్ఛంబు లేమొ?
ఏమహాత్ముని నైన నీతలోదరిమాట
యనువొంద నిలుపు, రాజాజ్ఞ యేమొ?

తే. ఏఘనుని నైన వేఁడించు నీశుభాంగి
తనువు, బంగారమే మొ ? యేధన్యు నైన
మరులుఁ జెఁదించు, నిది మరుమాయ యేమొ ?—
యనుచుఁ జూచిన జనములు వినుతిసేయు. 50

వ. ఇట్లు తల్లిదండ్రుల కల్లారు ముద్దుగా ముద్దియ యేప్రొద్దుఁ బ్రొద్దులు పుచ్చు నవసరంబున. 51

—* విద్యాభ్యాసము *—

తే. అక్షరాభ్యాస మొనరింప ననువు పడుచు
స్వరయుతంబుగ వీణాది వాదనములఁ
జెలఁగు గీతప్రబంధ విశేషకలన
గాననైపుణి నేర్చె సంస్కారయుక్తి. 52

సీ. రమణీయతరమైన రాయంచ మృదు చర
ణాబ్జసంగతిని నాట్యములు సలుపఁ,
జెలువమై ముద్దులు గులుకుపల్కులతోడఁ
బెంపుడురాచిల్క పేరుకొనఁగ,
రామాయణాది సద్గ్రంథముల్ మొదలుగాఁ
బజ్జఁ బుస్తకరాజి పరిఢవిల్లఁ,
దాళ కాలక్రియోదార తంత్రీ స్వర
భేదంబులను పాణి వీణ మెఱయఁ,

తే. జెలఁగు చిఱునవ్వువెన్నెలల్ చిలుకుచుండఁ,
గలికి తెలిడాలుచూపులు గలయఁ బర్వఁ,
బాండిమము దోఁచి భారతిభాతి నాతి
పసిఁడిగద్దియపైఁ బాట పాడుచుండె. 53

క. ఆపాట నవసుధాలహ
రీపటల మనోజ్ఞమాధురీ లలితంబై
కోపై వీనులకాపై
యాఁపైక రవంబుమాడ్కి నాపైఁ దోఁచెన్, 54

వ. అట్టిసమయంబున. 55

క. మదనాభిరామభూపతి
మొదవిన సంతోషమున మహోల్లాసముతోఁ
బొదలుచు గానము సేయఁగ
మదవతి నిజపుత్త్రిఁ జూచి మదిఁ జింతించెన్.— 56

తే. ఈ కులపవిత్ర సురుచిర హేమగాత్ర
చంద్రకళ గద; సంగీత జలధి కిపుడు
దీనికిని సర్వవిద్యలుఁ దేటపడఁగఁ
బేర్చి సాహిత్య మొదవఁ జెప్పింతు. ననుచు— 57

తే. కొలువుకూటంబునకు వచ్చి కువలయేశుఁ
డమర సింహాసనాసీనుఁ డై, ప్రధానుఁ
డగు వసంతాఖ్యు రావించి, యధికసంభ్ర
మమున మన్నించి పలికె సమ్మతి దలిర్ప. 58

క. ఓ మంత్రిశిఖామణి యిదె
నా ముద్దుల కూర్మి తనయ నయ మలరంగాఁ
గోమలగతి లయపద్ధతు
లేమఱిలక సరసగాన మింపుగ నేర్చెన్. 59

తే. గాన విద్యకుఁ దగినట్లు కన్య కిపుడు
కావ్య నాటక లసదలంకార భావ
సరససాహిత్య మేర్పడుసరణిఁ గఱపి
ప్రౌఢ గావింపవలయు నిరూఢమతిని. 60

వ. అనుచున్న సమయంబున సభాసదులు తమలో నిట్లనిరి. 61

తే. కలికిపాలిండ్లు మేలి బంగారుగిండ్లు,
చానవాల్జూపు లానుమచాపుతూపు,
లతివవదనంబు సదనమా నబ్ధిసుతకుఁ,
గాంతముంగురు లమ్మధుకరుల కురులు. 62

ఉ. మోమఖిలంబుఁ గన్నుఁగవ, ముచ్చటమీఱఁగ వక్షమంతయున్
గామిడి చన్నుదోయి, కసుఁగౌను సమస్తము మిన్ను, చూడఁగా
హేమము తత్తనూవిభవ; మీ రుచిరాంగికి విద్య చెప్పఁగా
నీమహి నెవ్వఁడోపు స్మరియించినమాత్రనె భ్రాంతి పుట్టఁగన్? 63
వ. అనిన విని వసంతుండు భూకాంతున కిట్లనియె. 64
క. ఓరాజ సకల శాస్త్రవి
శారదు లీపురమునందు చాలం గల; ర
వ్వారి నిటకు రావించి వి
చారింపఁగవలయు విద్య చదివింపంగన్. 65
చ. అన విని, సర్వశాస్త్రములయందుఁ బ్రశంసితులైనయార్యులన్
ఘనమతిఁ బిల్వఁ బంచి, నయగౌరవము ల్పచరించి, వారలన్
గనుఁగొని పల్కె భూవిభుఁ; 'డనంతగుణోన్నతులార, మీర లుం
డినఫల మేమి? యొక్కటి ఘటింపుఁడు మా' కన, వార లత్తఱిన్. 66
సీ. 'తర్కశాస్త్రములందుఁ దత్కల్పనలయందు,
భాషింపఁగను మహాభాష్యమందు,
శబ్దశాస్త్రములందు, సకలతత్త్వములందు,
శ్రుత్యంతములయందు, శ్రుతులయందు,
తత్పదక్రమజటాంతముల, నాగోహావ
రోహములఁ, బురాణరూఢియందు,
స్మృతివిషయమ్ములఁ, జెలఁగు మంత్రగ్రంథ
ములయం, దితరశాస్త్రములను మఱియు,
తే. ఘనులమై వాదములఁ బ్రసంగములు చేసి
గెలిచియున్నట్టి మముఁ బ్రసంగించి యెవఁడు
గెలుచు? మావంటివార లే కలనఁ గలరు,
రాజ్యరఘుపతి మదనాభిరామ నృపతి?, 67
చ. అన విని వారి కిట్లనియె నాత్మముదంబున భూమిపాలుఁ 'డో
ఘనమతులార, మీర లిటుఁ గారవ మేర్పడఁ గావ్యనాటకా

భినయ కవిత్వ కౌశలము పెంపఖిలంబుఁ గనంగఁజేయుఁ డీ
మనసిజదారజైత్రికిని మద్వరపుత్త్రికి మంజుగాత్రికిన్.' 68
వ. అనిన విని యార్యవర్యు లా రాజవర్యున కిట్లనిరి. 69
క. 'మేము రసజ్ఞుల మధిపా,
కామయ్యా; రసజ్ఞు లనఁగఁ గవివరులే' గా
దా? మాకుఁ గవిత్వము; లే
దీమహిఁ ఛాందసులఁ బొందునే యది తలఁపన్? 70
వ. అది యెట్లంటేని. 71
సీ. శబ్దాపశబ్దవిచారి యైనట్టి వ్యా
కరణజ్ఞు జనకునిఁ గాఁ దలంచు,
యుక్తివాదములచే నుప్పారుతార్కికు
భ్రాతఁగా బుద్ధి నేర్పడఁ దలంచు,
చతురమీమాంసావిశారదు సరసకుఁ
గదియఁగ షండునిఁగాఁ దలంచు,
నొదిగి వైదికనిష్ఠ నుండు సధ్యాపకుఁ
గనలి చండాలునిఁగాఁ దలంచు,
తే. వివిధముగ నిట్టు లధిప, కవిత్వకన్య
కావ్య నాటక లసదలంకార భావ
నవరసాభిజ్ఞు మది నిజనాయకునిఁగఁ
దలఁచి వరియించు దనుదానె వలపు మించి.' 7
వ. అని పలికిన విబుధేంద్రులకు రాజమహేంద్రుం డిట్లనియె. 7
క. వర నాటక కావ్యజ్ఞుఁడు
సరసుఁ డలంకారవేది ఛందోనిపుణుం
డురు సాహిత్య కళా నిధి
యరయఁగ నెవ్వఁడు వచింపు డతనిం దెలియన్. 7

—* పండితులు బిల్హణకవిని వర్ణించుట* —

తే. అనిన, 'మల్హణ బిల్హణు లనఁగఁ గవులు
సరసు లిరువు రలంకార సహితు; లందు
బిల్హణుం డనువాఁడు గంభీరుఁ; డధిక
తముఁడు కవిరాజనంగ స్తోత్రములు వడసె. 75

శా. ఆ వాచాలత యాకవిత్వవిభవం బాప్రౌఢి యాయూఢి యా
భావం బా మహితార్థగౌరవము నాపాండిత్య మాశాస్త్రబో
ధావిర్భావము నా సుధారస వచోవ్యాపార మాప్రజ్ఞ యిం
దేవిద్వద్బుధభేది కైనఁ గలదే యొంతేనిఁ జింతించినన్. 76

సీ. ధరణి వస్త్రములలో ధవళాంబరము మేలు,
ఋతువులలో సుమాస్వతము మేలు
సుమములలో శరచ్ఛోభి మల్లిక మేలు,
విలుకాండ్రలో రతివిభుఁడు మేలు,
ఘన సౌరభములలోఁ గస్తూరియే మేలు,
కలయ స్త్రములఁ గార్ముకంబు మేలు,
తనరు వాక్కులలోనఁ దర్కవాక్యము మేలు,
సారసముఖులలో శ్యామ మేలు,
తే. పరఁగు పదవులలో విష్ణు పదవి మేలు
దశలయందును యౌవన దశయ మేలు,
మహితగీతులలోఁ బంచమ లయ మేలు,
కవులలో నెల్ల బిల్హణ కవియ మేలు. 77

చ. మృగములలోన సింహ, మవనీంద్రులలో రఘురామమూర్తి, ప
న్నగములలోన శేషుఁడు, వనమ్ములలోపల నందనమ్ము, దే
వగణములోన శంకరుఁడు, వార్ధులలోనఁ బయోబ్ధి, యెట్టులో
మిగులఁగ నట్లె బిల్హణుఁడు మేటిసుమీ కవిరాజమండలిన్.' 78

వ. అనిన విని రాజువారల బహూకరించి యథాస్థానంబుల కనిచి మంత్రి
వరునితో నిట్లనియె. 79

—*రాజు బిల్హణకవిని బిలిపించుట*—

ఉ. 'ఆ కవిరాజరాజమణి నాదర మొప్పఁగఁ బిల్వఁబంపుమా;
యా కవితాచమత్కృతి విహారముఁ జూతము; మత్కుమారి క
స్తోకముగాఁ గవిత్వవిధిఁ జొప్పడఁ జేయుద;' మంచుఁ బల్కఁగా,
నాకడ మంత్రి సజ్జనుల నంచిన; వారును బోయి యచ్చటన్. 80

సీ. ఒకచెంత వేదాంత మూహించి ప్రకటించు,
నొకయోర మణిసార మొగి వచించు,
నొకచోట వరనాటకకలాపము రచించు,
నొకచక్కి ఘనఫక్కి కోక్తిఁ దెలుపు,
నొకయోర శృంగార యుత కావ్యములఁ జూపు,
నొకసీమ నురుసామ మూని పలుకు,
నొకదండ స్వరమండల కల గానముఁ బేర్చు,
నొకక్రేవ బహు భావ యుక్తి నెఱపు,
తే. నొక్కతలమున మీమాంస, యొక్కదారి
వ్యాకరణ పాఠ, మొకదెస నలఘు లక్ష
ణాద్యలంకారములఁ గోర్కు లమర నొసఁగు,
నట్టి బిల్హణుఁ గాంచిరి హర్ష మొదవ. 81

వ. కాంచి దండప్రణామంబు లాచరించి దీవనలు గైకొని సముచితాస
నంబులం గూర్చుండి కవిరాజశేఖరు నుద్దేశించి. 82

శా. 'దేవా, బిల్హణపండితేంద్ర, విను మర్థివ్రాతకల్పద్రుమో
ద్భావుం డామదనాభిరామనృపుఁ డత్యంతానురక్తిం బ్రతీ
క్షావాంఛన్ నినుఁ దోడి తెమ్మనుచు నాజ్ఞాపించె; విచ్చేయుమీ
యీవేళం దగ.' నన్నఁ బల్కెఁ గవియు న్నాలాగతిన్ వారితోన్. 83

ఉ. 'ఏమిప్రయోజనంబు? మము నేమిటికిం బిలువంగఁ బంచె నా
భూమివిభుం డుదాత్తమతి? భూరిగుణోన్నతులార, తెల్పుఁడీ
మే మట కేఁగుదెంచెదము మే' లన 'నేమిప్రయోజనంబొ? మా
కేమి యెఱుంగనచ్చు? మహనీయులు పూజ్యులు గారె పండితుల్.' 84

—* బిల్హణుండు రాజసభకు వెడలి వచ్చుట *—

వ. అని పల్కినఁ బ్రమోదమానాంతరంగుండై కవిపుంగవుం డమిత
శిష్యసంఘంబు గొలువ రాజమార్గంబున వచ్చునెడ.

ఉ. ఆముఖ సత్కళావిభవ మాకను బొమ్మలయంద మానయో
ఘామవిలాస మానయన తామర సాతి విశాల పత్త్రిరే
ఖా మహిత శ్రుతి ద్వయ వికస్వర కుండల దీప్త గండపా
ళీ మధురస్మితప్రభలు లేములు సూచి రుదంచితోన్నతిన్. 86

తే. చూచి తల యూఁచి తత్తనూ రోచిరాచి
తీమహిమ కాత్మ మెచ్చి యొంతేఁ బ్రసూన
బాణ బాణ విభిన్న సంభ్రాంత చిత్త
లగుచు నేకాంతములఁ గాంత లతిశయమున. 87

ఉ. 'ఎవ్వఁడు వీఁడు? చక్కఁదన మేమన? నెన్నఁడుఁ జూడ మెకవ్వఁడో?
బువ్విలుకాఁడొ? యాధనదుపుత్త్రుఁడొ? చంద్రుఁడొ? యాజయంతుఁ
డొ యువనితాశిరోమణుల హృద్వనముల్ చిగిరింపఁ జేయఁగా? [డో?
జవ్వని, యేఁగుదెంచిన వసంతుఁడొ? చూడఁగ నాను.' నావురున్.

మ. 'అతివా, పువ్విలుకాఁ డటంచనియె; దీ వజ్రాశుగం బేడ? నం
చితమా నిక్షుశరాస మేడ? మఱియుం జింతింప నవ్వారి ల
క్షిత తచ్ఛుభలాంఛనంబు లుపలక్షీభూతముల్ గావె; నా
మతి నూహింపఁగ వచ్చెనో హరి తగన్ మానుష్యరూపంబునన్.' 89

సీ. రాకాకళా శోభి రాజబింబ మటంచు,
వినుతి సేయఁగఁ బోలు వీనిమోము,
ప్రత్యూష వికసితాబ్జాతపత్త్రము లంచు
వీక్షింపఁ దగు వీని వీక్షణములు,
శ్రీకుమారుని హేమ సింహాసనం బంచు
వెస నెన్నఁగా నగు వీనియురము,
ప్రోన్నమిత స్ఫటోద్యత్తాహిపతి యంచుఁ
బలుకవచ్చును వీని బాహుయుగము,

తే. తుంటవిల్కాఁడు ముక్కంటి కంటిమంట
నంటునను జెడి మఱి తమ్మికంటికరుణ
మగుడఁ బుడమికి దిగెనో? తగ నతండు
నకియ గాకున్నఁ గలదె యీ చక్కఁదనము? 90

సీ. ఈ పురుషోత్తము నెద వసించిన పద్మ
కర భాగ్య మే మందుఁ గమలనయన?
యీచతురాస్యోక్తి నెలమిఁ గాంచిన శుభ
వాణి ప్రౌఢిమఁ జెప్ప వశమె తరుణి?
యీ మేటిసర్వజ్ఞు నెనసి యుండిన సతి
భూతి యింతింత నఁ బొసఁగ దబల?
యీధామనిధిఁ గూడి యింపొందు సుచ్ఛాయ
పదవి యెంతని చూతుఁ బద్మగంధి?
తే. వినవె యీ వనితా నవ మనసిజాతుఁ
గూడి క్రీడించు తరుణుల కోర్కెల్ల
సఫల మగు; వీనిసంగతి సలుపనట్టి
వెలఁది జన్మంబు ధారుణి వృథయ కాదె. 91

వ. అని యిట్లు వర్ణించుచుండ; బిల్హణుండు నిజానన సుధాకర ప్రభా జాలమ్ములకుం దత్రత్య జన విలోకన సందోహమ్ములు చకోరికా బృందమ్ములు గాఁగ; మత్తేభంబుచాడ్పున మందగమనంబున వచ్చి, విద్వజ్జన మంత్రి పురోహి తామాత్య భృత్య వర్గంబుతోడఁ దగు రాజేంద్రువలనఁ బ్రత్యుత్థానాభివందనంబులు గైకొని సముచితాసనంబు నధివసించి, యాశీర్వాదపూర్వకంబుగా వేదశాస్త్రాదికంబు లుపన్యసించి, ఫల సహితంబుగా మంత్రాక్షత లొసంగి, మఱియును. 92

క. కవితాప్రసంగ మెంతయు
నవిరళముగఁ గొంత చేసి, యచ్చటి విద్వ
త్కవివరులచేత మెప్పుల
నవనీపతి హర్ష మొంద నందెఱ వేడ్కన్. 93

క. గురు కవి భాషిత యుతమై
సురరాజ సభాస్థలంబు సొంపునఁ దద్భూ
వరుని సభాస్థలి విబుధా
కరమై పరమై ప్రమోదకరమై యొప్పెన్. 94

తే. రాజరాజైనమదనాభిరాముఁ డలరి,
తనదు కంఠస్థహారాళిఁ దగ నొసంగి,
మఱియు మణి రుచిరాంబర మహిత భూష
ణావళులు లొసంగి, విడిదికి ననిపెఁ గవిని. 95

వ. అప్పుడు మితజనపరివృతుండై భూవరుండు మంత్రితో నిట్లనియె. 96

చ. మరుఁడు తనూవిలాసమున, మంజుల వాక్య విశేష యుక్తి చా
తురి ధిషణుండు, సత్కళలఁ దోయజవైరి; తలంప వీనిఁ దా
మరసదళేక్షణ ల్గనిన మారశరాహతిఁ గ్రాఁగుచుందు; రీ
వర కవియొద్ద మత్సుతకు వాంఛిత విద్య లభించు టెట్లొకో? 97

తే. వినుము జగతికి వరకల్పవృక్ష మితఁడు;
వినిలావణ్య మనియెడు విరులగుత్తి
దనరు తారుణ్యవతుల చిత్తంబు లనెడు
మధుపముల రేఁచి తిరుగుచు సమ్మతి దలిర్ప. !8

సీ. వీని మనోహరానూన భావముఁ గాంచి
మే నెఱుంగక పోవు నూనశరుఁడు,
వీని భాసుర కళావిఖ్యాతిఁ గనుఁగొని
మి న్నందు నెపుడు తమీవిభుండు,
వీని సౌందర్యాతివిభవంబుఁ బరికించి
రెప్ప వేయక చూచు వృషసుతుండు,
వీని సౌభాగ్య శోభిత వృత్తిఁ గని యుత్త
రాశఁ జెలంగు విత్తేశసూనుఁ,
తే. డవుర వీనికి దీఁటైన యతఁడు గలఁడె
వసుధఁ బరికింపఁగ సుపర్వవనిత లైనఁ

దోడరి మూర్ఖానుగతిఁ జెందుదురు; మనుష్య
కాంత లన నెంత యాతనిఁ గాంచి నంత!' 99

క. ఈవిధమునఁ బల్కి నపతి
కావిబుధేంద్రుఁడు సుమంత్రి యనియెన్ 'నృప వ
ర్యా, విద్యాభ్యాసము చెలి
కేవిధమునఁ బట్టునఁటు గవీంద్రుఁడు లేమిన్ ? 100

క. ఇతఁడు వినాగా నెవఁ డీ
క్షితితలమునఁ గవివరుండు సెప్పుమా.' యనినన్,
'మతిమంతుఁడ వీ విధమున
కతిచతురోపాయ మొకటి యాత్మఁ దలఁపుమా.' 101

వ. అని నృపాలుండు పల్కిన మంత్రి యి ట్లనియె. 102

క. "దేవరవారికిఁ దెలియని
దీవిశ్వమునందు లేద యేదియు; నైనన్
నే వచియించెద వినుమీ
దేవ, భవత్కరుణనాకుఁ దెలిసినయంతన్. 103

మ. ఒకచిత్రవ్రతమున్న దిర్వురకు వినోరాజచూడామణీ,
నకలంకాత్మిక యా భవద్దుహిత జాత్యంధు న్విలోకింప; దా
సుకవీంద్రుండును గుష్ఠగాత్రి నెపుడుం జూడండు దాఁ, గావునన్
రక మానొక్క యుపాయ మీకతమునన్ రాజేంద్ర పన్నం దగున్.

మ. 'కవిరాజాగ్రణి పుట్టుగ్రుడ్డి' యని యాకంజాక్షికిం జెప్పి, యా
కవికిన్ 'మీసుత కుష్ఠగాత్రి' యని వేడ్కం దెల్పి, యవ్వారికిన్
భువి నన్యోన్యవిలోకనక్రియలు నేర్పుల్ మీఱఁ గాకుండున
ట్లు విచారించెద నొక్కయుక్తి వినుఁ డిట్లున్ రాజదేవర్షభా. 1(

క. ఇరువురకు నడుమ నొక తెరఁ,
దిరముగఁ గట్టించి చదువు దృఢతరమతిఁ జొ
ప్పరయుచు మానకన్యక చే
సరవిం జదివింత మయ్యా జగతీ నాథా. 1

వ. అనిన విని సంతుష్టస్వాంతుం డై భూకాంతుండు. 107

క. 'ఓమంత్రి, యెంతవాఁడవు!
నీమహిమ నుతింపఁ దరమె! నిర్మలగుణ, నీ
వేమంటి వేమి చెప్పితి
వామాటల నట్ల చేఁత యది మేలుగదా.' 108

వ. అని యంతఃపురంబుఁ బ్రవేశించి. 109

చ. జలరుహపాణి వారిధర చారు మనోహర వేణిఁ గాంచనో
జ్జ్వల రుచి గాత్ర నీలజలజాతదళాయత నేత్ర నంతిక
స్థలమున నున్న దాని సుమసాయకు మానినిఁ బోలు నాత్మజన్
చెలఁగొని కాంచి ముద్దుఁగొని నెమ్మి దలిర్పఁగఁ దండ్రి యిట్లనున్. 110

— * రాజు తనకుమార్తెతోఁ బిల్హణుం డంధుం డని చెప్పుట * —

క. 'నాగర్భజలధిరత్నమ,
నీగారాబంబుఁ జూడ నీ కెప్పుడు నే
రాగంబున సాహిత్యము
బాగుగఁ జెప్పింతు నమ్మ ప్రౌఢి దలిర్పన్. 111

క. సంగీతవారిధికి సా
రంగధ్వజరేఖ వగుచు, రాజిత కవితా
సంగతి లేక చెలంగుట
భంగంబు గదా తలంప భావములోనన్. 112

క. సంగీతవిద్య కెలమిన్
సంగడి సాహిత్యవిద్య సరిగా రెంటన్
మంగళవతి కూడిన, నా
సంగతిఁ జెప్పంగఁ దరమె సంగీతనిధీ? 113

క. మనపట్టణమున విద్యా
భినయజ్ఞుఁడు గలఁ డొకరుఁడు బిల్హణుఁ డనఁగాఁ
దనయా, జాత్యంధుం; డా
తని చెంగటఁ జదువవలయుఁ దత్పరమతి వై.' 114

వ. అనిన విని యక్కుమారి. 115

ఆ. 'అయ్య, నేను చూడ నాకవియొద్దను
జదువు లెల్ల నెటులఁ జదువుకొందు?
నంధకాననంబు నాలోకనము సేయ
నని వ్రతంబు నాకు జనక గలదు. 116

క. అంధకునిఁ బాండురోగిని
బాంధవదూషకుని షండుఁ బాపాత్ముని దు
ర్గంధయుతుఁ గుష్ఠరోగి వ
సుంధర దర్శింపరాదు శుభగుణచరితా.' 117

వ. అనిన, జనకుం డి ట్లనియె. 118

క. 'పట్టీ, యీలా గందురె?
యె ట్టయినను విద్య నేర్చు టెంతయు బాగౌఁ;
గట్టిగ మీయిరువురకును
గట్టించెదఁ గాండపటముఁ గనరాకుండన్.' 119

వ. అని యొడంబఱిచి, మఱునాఁడు సమయోచితకృత్యంబులు దీర్చి, కనకమణిమయ భూషణాంబర భూషితుం డై కక్ష్యాంతరంబులు గడచి, యెడనెడఁ బుడమిజేజేలదీవనలుఁ గైకొనుచు, బహుదివసాగత దేశాధీశుల మనవులు సముచితజనులవలన వినుచుఁ, గొందఱు సుందరులు ముందఱ బారు లై కైవారంబులు సేయఁ, గొందఱు కంజాతపాణులు మంజులగతి వింజామరలు వీవఁ, గొందఱు కీరవాణులు చేరి పరాకులు గావింప, నొక్కకర్పూరగంధి కపురంపుబాగా లొప్ప మిగుల నందియ్య, నందియలు మ్రోయ నొక్కమందయాన యందంబుగా చందనాదు లొసంగ, సంగడినూడిగంపుఁజెలు లిట్లు సముచిత ప్రకారంబునఁ గొలిచిరా మందగమనంబున వచ్చి వచ్చి రాజితకమలాకరంబు చందంబున నందం బగుచు రాజ్యలక్ష్మీ లక్షితం బైనయాస్థానమంటపంబుఁ జొచ్చి సముచిత కాంచనాంబుజ మధ్యంబు నధివసించు రాజహంసంబు పొంపునఁ గాంచనసింహాసనంబు నధిష్ఠించి మదనాభిరామరాజహంఁ

సుంకు విబుధగణపరివృతుం డై, మహేంద్రుం డగుచు, సదా నవన క్షత్రి సమన్వితుండై, కువలయాధీశుం డగుచు, మహాభోగిపరివేష్టితుం డై భూభృద్వతంసుం డగుచు, రాజకుమారసేవితుం డై రాజశేఖరుం డగుచు, సముచిత భాషా సమన్వితుండై చతురాననుండగుచు, సుమనః ప్రసన్నుండై పురుషోత్తముం డగుచు, సభంగు లైన వాహినీశులును, నపుణ్యాజనబాధకు లైన సుమనోవల్లభులును, నవనశాలు లైన ప్రచేతసులును, ననంతకు లైన సమవర్తులును, ననుగ్రహానహితు లైన ధనాధిపతులును, నచంచలు లైన మహాబలులునుఁ, గొలువఁ గొలువుండి మంత్రివరునితో నిట్లనియె. 120

తే. 'ఓవసంతక, రూప మహావసంతుఁ
డగుకళానిధిఁ బిలిపింపు; మాకళాధి
వాసిముఖి కొప్పఁ బలికితి వాసి మీఱ.'
ననఁగఁ బిలిపించె గవివరు నాతఁ డపుడు. 121

క. వచ్చినకవివరుఁ గనుఁగొని
విచ్చేయు మటంచు నుచిత విధుల నరేంద్రుం
డచ్చపడఁ జలిపి, కొండొక
ముచ్చటలుం గడపి, కుతుకమున నిట్లనియెన్. 122

ఉ. 'ఓకవిరాజచంద్ర, విను మొక్కటి సెప్పెద; మత్కుమారి క
స్తోక కళావిశేషములు చొప్పడఁ జెప్పుచు లక్ష్యలక్షణ
శ్లోక కవిత్వ రూఢి కవిలోకము సన్నుతిసేయఁ దెల్పుమా,
నాకు గురూత్తముండ వయి మత్కృతసత్కృతిఁ గాంచి వేడుకన్. 123

—* రాజు బిల్హణునితోఁ దనకుమారిత కుష్ఠరోగిణి యని చెప్పుట *—

తే. అయిన నొక్కటి కలదు, మదాత్మజాత
కుష్ఠరోగంబునను గొంత కొఱన యయ్యె;
వినయమందు మనీష వివేకమందు
గానమందుఁ బ్రవీణ విజ్ఞానప్రౌఢ యయి.' 124

... నా గవిశేఖరుం డిట్లనియె. 125

క. 'ఓహో! బాగాయెఁగదా!
యూహింపఁగ నెట్లుఁ జెప్ప నోపుదు విద్యా
వ్యూహంబు? కుష్ఠుగాత్రిని
నాహా వీక్షింపరాదు హరివంశమణీ. 12

వ. అది యెట్లంటేని. 12

క. వ్రత మొకటి కలదు నాకుఁ
శ్రుతిహీనునిఁ గుష్ఠరోగిఁ జూడ నటంచుఁ,
మతి సంశయింప నేటికి ?
ద్రుతముగ ననుఁ బంపనయ్య రూఢవిచారా.' 12

వ. అనిన విని రాజేంద్రుం డిట్లనియె. 12

క. 'దానికి నొక్కటి చెప్పెదఁ,
గానియెడఁ నడుమఁ బటముఁ గట్టించెద; స
మ్మానముఁ గైకొని విద్యా
దానము సేయంగవలయు దాక్షిణ్యనిధీ.' 13

ఉ. అంతనఁ నయంబు వినయంబుఁ దోలంకఁగ బిల్హణుండు రా
జేంద్రునిఁ జూచి పల్కె; 'వసుధేశ్వర, మీమన సట్టు లుండఁగా,
నిందుల కేమి యందు? భవదీయ వచో గతి మీఱ రాదు; మే
లొందఁగఁ దోఁచినట్లు సతి కొప్పుగఁ జెప్పెద విద్య నేర్పునఁ.' 13

వ. అనిన, నృపతి స్రగ్గంధ కుసుమ తాంబూలాది ప్రదానంబుల నాతః
సంతుష్టుఁ గావించి పుచ్చి; దరహసితవదనుఁడై యిష్టసఖునితో— 13

తే. 'నీయుపాయము బాగాయె, నీతివేది;'
యనుచు భూషించి తత్క్షణంబున నిమిత్త
కోవిదులఁ బిల్వఁ బంచి, యొక్కొ వలచేతుఁ
డనియె 'శుభలగ్న మీక్షింపుఁ' డనుచుఁ బ్రీతి. 13

వ. ఇట్లు ముహూర్తనిర్ణయంబు సేయించి గృహకాయల —ంపించి వివిధ
విచిత్రంబుగా విద్యాశాలిక రచియింపం జేసి. 13

— * విద్యారంభము * —

తే. అపుడు మదనాభిరామ నృపాగ్రగణ్యుఁ
డతుల మైనట్టి శుభదినమందు హితుల
బాంధవుల మంత్రివరులను బండితులను
గవుల రావించి బిల్హణకవినిఁ బిలిచి. 135

క. తన కూర్మి తనయ నధిపతి
తనరఁగ రావింప, వెంట దవిలి సదాళుల్
గని యామోదమునను రా,
సనయంబున వచ్చి పటము చాటున నిలిచెన్. 136

వ. అప్పుడు పురోహితులు పుణ్యాహవాచనం బాచరించిన, నంతరంబ.

తే. మొదల విఘ్నేశ్వరుని వాణిఁ బూజచేసి
బాలరామాయణమునను బద్య మొకటి
నర్థయుక్తత నారంభ మర్థిఁ జేసి
ప్రేమఁ జెప్పంగఁ దొడఁగె నా బిల్హణుండు. 138

వ. అప్పు డప్పుడమిఱేఁడు సమస్త విద్వజ్జన భూసు రాది బాంధవులకు భోజనంబులు గావించి మణిమయ భూషణ వస్త్ర మాల్యానులేపన తాంబూ లాదికంబులం బరితృప్తులం జేసి, మఱియును. 139

మ. జననాథాగ్రణి పుత్త్రికిం గవికి నిష్టం బొప్పఁగా నిత్యభో
జన తాంబూలము లంచి తాంబరములున్ శయ్యాసన స్రక్సులే
పనముల్ తక్కువ గాక యుండ నమరింపంగాఁ గవీశుండు జ
వ్వనికిం గావ్యము లాదిసేసి కలిపింపన్ సాఁగె నానాఁటికిన్. 140

క. సర సాలంకార మనో
హర కావ్యము లర్థయుక్తి మైఁ జెలు వొప్పం,
బరఁగ సుశబ్దవిచారము,
వర సాహిత్యంబుఁ దేట పడఁగాఁ దెల్పెన్. 141

తే. జగతి జనములు మెచ్చి యాశ్చర్య మొంద
లలితముగ బిల్హణాఖ్యునివలన సకల

విద్యల గ్రహించి జలధర వేణి యొప్పె
సంబులాసిన తప్త లోహంబుకరణి. 14

సీ. వివిధ భావవిశేష నవరసంబులయందుఁ,
బ్రీతి నలంకార భేదములను,
ఛందో విభేద లక్షణముల, వర నాట
క ప్రక్రియల, మహాకావ్యములను,
గామప్రదము లగు కామశాస్త్రములందు,
జ్యోతిష శాస్త్ర సంగీతశాస్త్ర
ముల, నభినయకళా కలితమార్గములందు,
గణిత తత్త్వాసుర కాండములను,
తే. ప్రౌఢ యై మించి శ్లోకార్థభావ మెఱింగి
సంస్కృతప్రాకృతంబులఁ జతుర యగుచు,
హితము మీఱఁ గవిత్వ మూహింపఁ దొడఁగె
యామినీపూర్ణతిలక వాగతిశయమున. 14

(చక్రబంధము)

శా. ధన్యా సింహభ చంద్ర కీర్తి వర విద్యా పణ్డితార్యక్రమా
గణ్యాగర్వధనంజయా శివద ముక్త్యాకృత్స్నగంకప్రభా
జన్యా రాజిత భూరి శాత్రవ కుభృజ్జాతిప్రభా విక్రమా
మాన్యారాధన త్యాగభోగజయధామా నవ్యభాగ్యోత్తమా. 14

(మాలిని)

కాండ భూభవాసితాంశు కాండ భూభవాదిరా
ట్కాండ భూభవాబ్జసుప్రకాండకాండభూ మరు
త్కాండభూభ వాపగోర్మి కాండ తుండిరా ట్సుధా
కాండ పాండుభా విభా స్వఖండ కీర్తిమండలా. 1

గద్యము. ఇది సీతారామ చరణసేవా ప్రభావ సంపాదిత కవితా విచి
కాశ్యపసగోత్ర పవిత్ర శ్రీమత్పిండిపెద్దికృష్ణస్వామి ప్రణీతం బగు
బిల్హణోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము

శ్రీహయగ్రీవాయ నమః.

# బిల్హణీయము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీమానిత వర రఘుకుల
సోమా సోమాంతరంగ సురుచిర భవనో
ద్దామ విలాస యశః పర
సీమా మహనీయనామ సీతారామా. 1

అవధరింపుము తదనంతరంబ. 2

—* వసంతకాలము *—

అలరె వసంతకాలము పురాంతికసీమ వనాంత పుష్ప స
మ్మిళిత మరంద పాన భర మేదుర మత్త మధువ్రతాంగనా
కల మృదు గాన లోల మతికాంత రసాల విశాల పల్లవో
జ్జ్వల పిక నాద సంచలిత చారు వియుక్త జనానుఖేలమై. 3

అల మధుమాసవేళ జలజాయతనేత్రలు క్రీడ సల్పుచోఁ
గొలఁకులపజ్జఁ జేరి నవ కోమల కాంచన పుష్పజాలముల్
హాలహాలికల్ గ్రహింపఁగ సదాళు లిసీ యని యేఁగ నవ్వె; భూ
తలమునఁ గాంచనాపహృతిఁ దల్పరుగా సుమనః ప్రవర్తనల్. 4

చెలఁగ వసంత భూరమణ శేఖరుఁ డోలి మహావనీస్థలిం
గలయఁగ నేలి, పైక మెసఁగం దగఁ గైకొని, ముద్రవెట్టుచో
వలనుగ హేమరాశి మధుపాయికిఁ జూపక, వైరిజాతులన్
మలయు హరించుమిత్త్రి వసుమంతునిఁగా నొనరించె నాఢ్యుఁడై. 5

6. కమలామోదము సంఘటించి, శుకవాక్యం బర్థి నాలించి, యా
సుమనఃకాండము లెల్ల బోధముఁ గనన్ శోభిల్లఁగాఁ జేసి, ని

త్య మహాభూతిఁ బలాశ భేదన కళా వ్యాపారి యై, మాధవుం
డు మహిం గౌరవజాతి నేపడఁచి యుండుం సద్ద్విజు ల్మెచ్చఁగన్. 6

చ. మనసిజ చోరకుండు తఱి మాటున బ్రూఁజిగురాకుఁ బాకు చే
కొని మెయి డాఁచి వేగ తమిఁగొల్పి శశిం బయిఁ గాపువెట్టి తా
ల్మిని బటు ధైర్యభిత్తిఁ బెకలించి సమీరపు మచ్చు చల్లి చ
య్యన హరియించి మించెఁ బ్రమదాంచిత మానధనంబు లెంతయున్.

చ. మరుఁ డను సోమయాజి వన మధ్యమునందు ద్విజాళి మంత్రముల్
కరముఁ బఠింపఁగా శిఖి ప్రకాశిలఁ గాంచి మరుద్గణంబులన్
వరుస భజించి రాజున కవార్యశుభోన్నతిఁ జెందఁ జేసె నాఁ
బరమమతిఁ వియుక్త పశు బంధము మాధవుఁ బ్రీతుఁ జేయుచున్. 8

సీ. మాకందములు నీడ మాకందములు చూడఁ
జేకొమ్మ యొకొమ్మ చిగురుఁగొమ్మ;
గోరంట డాయవే గోరంట రాయవే
యీచాయ నేచాయ నింపుఁ జేయఁ;
దిలకంబు మానినీతిలకంబు పూను నీ
చేయాన నీయాన చెలఁగుఁ దాన;
పున్నాగములక్రిందఁ బున్నాగములఁ జెంద
నాసొంపు రతిపెంపు నందగింపు;

తే. ఇట్లు ప్రమదలు సఖులతో నెనసి మనసి
జాత దీపిత హృదయులై సంతసమున
సరస వనకేళికా మహోత్సవము లలర
వెలయుచుందురు మధుమాస వేళలందు. 9

సీ. ఘన రసాలంబుఁ గైకొనియెఁ గోకిలవాణి,
పదరి పోఁ బోకు వే పల్లవోష్ఠి;
యనుపమ సరసిఁ దా నాఁగెఁ జక్రస్తని,
మే లని కదియకే మీననేత్రి;

చిగిరించుబలుగొమ్మఁ జెందెఁ గుంజరయాన,
చేరఁ జూడకువె రంభోరుయుగళి;
కదళికా తరు వందెఁ గర్పూర వరగంధి,
కూడకే లికుచ వక్షోజకుంభ ;
తే. యనుచు నొకబోటి యదలింప నతివ గొనద
'రామలార, చంద్రాస్యలార, హరిమధ్య
లార, సురభిళ నిశ్వాసలార, సలుకు మానుఁ
దపియించు దిగులొందు మాయు' ననుచు. 10

సీ. బింబోష్ఠి చిలుకలఁ బిలిచి ముద్దాడంగ,
సాంకవగంధి మెచ్చకయ గసరె;
జలరుహచరణ హంసల గారవింపంగఁ,
ఘనవేణి రొప్పుచుఁ గడకు నెత్తెఁ;
గుసుమాంగి యళులఁ జే కొని తేనె లియ్యంగఁ,
గాంచననాస తప్పించి తఱిమెఁ;
గిసలయపాణి కోకిలములఁ బలికింప,
రామాభిరామ యూరకయ యనిపెఁ;
తే. బలుకులను యానముల నంగములను గీత
ములను శోఁదోఁట నరయుచు వెలఁదు లిట్లు
మరునిబలములఁ గొందఱు మరులు గొలుపఁ
గొంద ఱవి చూచి నిరసింతు రంద మలర. 11

వ. మఱియును. 12

సీ. కలికి చిల్కలకొల్కి ఫలములు గోయవే,
కోకిలవాణి చిగుళ్లు దేవె,
డీటుగా నలివేణి తేనియల్ కూర్పవే,
పావనచరిత పుష్పములు దేవె,
కలహంసగమన మేల్ జలము లాసింపవే,
చంద్రానన సుధారసంబు దేవె,

పాటలాధర వేగ పీటి ఘటింపవే,
భర్మోపమాంగి దీపంబు దేవె,

తే. యనుచుఁ దమలోనఁ జెలులు సయ్యాటములను
సరస వనకేళికా మహోత్సవము మెఱసి
యసమశరదేవుఁ బూజింతు రంచ మలర
సార మధువేళఁ గాసార తీరములను. 13

తే. ప్రకటి తాగమ వాసనా ప్రథితము లయి
విమల కాసార గౌరవ విభవ మంది
లలిత మైనవసంతకాలమునఁ గాన
నములు చెలువొందు నాకాననముల కరణి. 14

మ. సకియా, కొమ్మలు పల్లవావళులతో సయ్యాటముల్ సల్ప, హా
లికుచంబుల్ ఫలసంగతిన్ వెలయు, నా లీలాగతుల్ గంటి వే?
సకియా, కొమ్మలు పల్ల వావళులతో సయ్యాటముల్ సల్ప, హా!
లికుచంబుల్ ఫలసంగతి న్వెలయుట ల్చిత్రంబె యూహింపఁగన్. 15

ఉ. 'రాగముతో సదాళి తనరం బొది సేయఁగ, నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమనస్థితి నున్నది చూడు' మన్న, 'హా!
రాగముతో సదాళి తనరం బొదిసేయఁగ నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమనస్థితి నుండుట చిత్రమే చెలీ?' 16

సీ. చిగురాకు లవి యేల చీల్చెదరే? వన
ప్రియ చయా శాప్తి హరింప రాదు;
బిసకాండముల నేల విఱిచెదరే? హంస
జీవన చ్ఛేదంబుఁ జేయ రాదు;
మకరందముల నేల మాపెదరే? సదా
ళి నిరాకరణ వృత్తిఁ బెనుప రాదు;
కువలయంబుల నేలఁ గూల్చెదరే? ద్విజ
రాజసంప్రీతి నార్పంగ రాదు;

తే. అనుచుఁ గొందఱు సుందరు లంద మలర
వనుల సరసులఁ గ్రీడించు చనుదినంబు
సరస వాక్ప్రౌఢిఁ జూపుచుఁ జతుర గతుల
వెలయు చుందురు మధుమాస వేళలందు. 17

వ. మఱియు న వ్వసంత సమయంబునం గాంత లింతిం తనరాని సంతసం
బుల సంతత తంతన్యమాన తరు సంతాన నితాంత కాంతంబు లగు ల
తాంతంబులు నిరంతర పరిమళవంతంబు లగుట బంతులు గొను తేఁటుల
రంతులకు నలంతిఁ గొని చింతల నత్యంత సుమరస దంతు రాంతరంబు
లగు కనక వనాంతరంబుల కరిగి, తదంతరంబుల వంతులు మీఱ సేవం
తులు గోయుచుఁ, బూబంతులు గట్టుచు, నెంతయు వింత లగు కంతుని
చికిలి కుంతంబు లన మంతున కెక్కి శశికాంతరుచుల వింతఁ గొని దొం
తర లగు కలికాసంతతులఁ గాంతిమంతంబు లైన ప్రాంతంబుల నలరు
వాసంతికా నిశాంతంబుల మంతనంబులు మెఱయ రతికాంత విజ
యోదంతంబు లగు పంతంబు లాడుచుఁ గొంతదడవు తోడియింతులఁ
గికురించుచు, నిగనిగని పగడముల వగఁ దెగడు నొగరుఁ దొగరుఁ
బొగరుఁ జిగురులఁ గొరక నధరముల కెగిరి పగగొను మగకోయిలల
తెగలు నెగు లెగయ మిగులఁ దగుల నొగిలి నగ మగుచుఁ, బులుఁ
గులకు సరిఁ గనఁబడక మగిడి, సరిగపని జిలుఁగు నగరపు అకవిలు
బిగిఁ బగు నిగిడి పొంకంబు లగు బింకపుఁ జన్నుల నెలవంకల నింకక
వెడలి యకలంక లోహితాంకురంబు లగుసంకుచిత సంకుమద కుంకు
మ పంకంబులు జాఱఁ, బంకజరసంబులు దొలంకు కొలంకులఁ దేనియ
వంకల నిరువంకల నలంకరించు లంక లగు కంకేళి వనాంగణ విటం
కంబుల మీనాంక ధనుష్టంకార శంకాకరంబులై సు కెడలిన గొర
వంకల పల్కులకుఁ గొంకుచు, జంకెనచూపు లకలంక రత్నాంకిత
తాటంక రుచులతో లంకెలు గొనఁ గింకరీ జన సంఘాతంబుల వంకలఁ
దలంకక నిలుపుచు, నందంద యరవింద గంధ తుందిల మందానిల
సందోహంబులఁ గందళిత కుంద చందన మందార బృందాన్వితంబు